# వాగనుశీలనము

కర్త :

డాక్టర్ బొడ్డుపల్లి పురుషోత్తం

స్వీకర్త :

ఆచార్య శ్రీగంటి జోగి సోమయాజి

ప్రచురణ, వివృతి రచన :
కె. గిరిజాలక్ష్మి యం. ఏ., యం. ఫిల్.,

వెల : ఐదు రూపాయలు



శ్రీ గిరిజా ప్రచురణలు
బి-31 : విద్యాలంకార్
శ్రీనివాసనగర్ కాలని
గుంటూరు -6

శ్రీ లక్ష్మి ప్రెస్ : అరండల్ పేట, గుంటూరు.

# అభిప్రాయం

ఆచార్య కోరాడ మహాదేవశాస్త్రి
60 సింగరాచారి వీధి_ట్రిప్లికేన్_మద్రాసు

శ్రీ బొడ్డుపల్లి పురుషోత్తంగారు జగమెరిగిన బ్రాహ్మణులు. సంప్రదాయ వ్యాకరణంలోను ఆధునిక భాషాశాస్త్రంలోను మంచి పాండిత్యం గలవారు. వీరు ఈ కృతిలో భాషను గురించి ప్రతి ఒక్కరు తెలుసుకొనవలసిన మౌలిక విషయాలను సువ్యక్తంచేస్తూ తేటగీతిలో తియ్యగా గానం చేశారు.

విజ్ఞానము, ఆనందము సమపాళ్ళలో రంగరించి కూర్చిన 'వాగనుశీలనం' భాషావిద్యార్థులేకాదు, తెలుగువారందరు అవశ్యము చదవవలసిన గ్రంథం.

# An Opinion

**uta tvah paSyan na dadarSa vaacam**
**uta tvah Srnvan na Srnotyenam**
**uto tvasmai tanvam vi sasre**
**Jaayeva patya uSate suvaasaah**

This Rigvedic verse makes it clear that not everyone who sees and hears the sacred WORD really sees and hears Its inner import——— except the man f self-realising knowledge, to whom it discloses Its rue meaning, even a well dressed, loving wife reveals ermself to her beloved husband.

A perusal of this book would convince the reader hat the holy VAAK divulged HER inmost secrets to Dr. Boddupalli.

Not verybody can agree with the author's conclusions, but nobody can contradict his *premises*. His logic is that, in as much as language is a living entity, it must lend itself to evolutionary emancipation, unshackled by the rigid, rigorous rules and regulations of traditional grammar.

This need not make us characterise this *Critique of Speech* (Vaak-anusiilanam) as an iconoclastic work. Actually, the poet is a traditionalist ——— the way he quotes (borrows) all the popular, authoritative dicta concerning the equanimity, the word-meaning mutuality, the true ornamentality and the well-understood, beatitude-yielding usage of Speech, from the Giitaa, the Alankaraas and Bhartrihari——, who likes to temper his tradition with dialectical modernity. In the process, he may cause the raisin- of the eyebrows of some highbrows, with hi 'samaasaas' like "bahuvidhaantastulu".

Likewise, his otherwise well-intentioned advocacy of intelligibility as the main criterian of linguistic usage would embarrass knowledgeable ears and eyes,

if it were to apply even to literary creation. For instance, his "kaaram-khaaram" non-distinction of meaning would sanctify "Mallikhaarjuna" and "Saa-khaaharam", the common errors.

Again, there is an intellectual pleasure in respecting certain 'tatsama' words. Rama could detect from the mere speech of Hanumaan ——without examining his scriptural knowledge —— that he was a Vedic scholar; the cuckoo and the crow that look almost alike can be distinguished by their vocalisation. While the layman is free to speak as he *will*, the scholar should speak and write as he *can*: the former makes no distinction between 'dantya and 'taalavya';S—— as in "Siitaa kaalam" (which would mean, the season of Siitaa Devii) for 'Siita kaalam (winter). As the author rightly quoted the authority of Paanini himself for the acceptance of linguistic flexibility, none quarrels with his liberal views. At the same time, the delight of the awareness of the subtle distinctions in pronunciation (this English word is commonly misspelt and mispronounced by fellow-country men, by the way, like the layman's mistaken stressing of the 'h' in "uchchaarana" is lost if we admit the popular non-distinction

between such words as 'artha' and 'ardha' (curiously enough, the perverse Telugu printer used 'ardha' in the first line of the last verse on page 23 and 'artha' in the third line of the first verse on the next page ——— where they should have been printed vice versa). Particularly, since the author has employed the "bandi RA", one would have preferred to see him attach due importance to certain standards of linguistic purity. To the knowing ear the mispronunciation carries the wrong meaning: just as we have to distinguish between 'sakala' (all) and 'Sakala' (bit), so also in Urdu and English, to take the example of the languages widely known in this country, the 'j' and the 'z' have to be properly distinguished between——— so that 'good' (jaleel) does not become 'bad' (zaleel) and the 'zealous' man does not turn 'jealous'.

This is not to strike a discordant note in what is primarily meant to be an 'introduction' to this book, but if the author had not predominantly employed the 'graanthika' style, and instead stuck to the 'vyaaaharika' language, one would not have faulted him for the colloquial usage of that very word 'vyavahaarika' (sic).

The author should be commended for his condemnation of the thoughtless linguistic chauvinism which tries to find 'Janya-Janaka' relationship even between Telugu and English. At the same time, one must not lose sight of the fact that the Indo-European family of languages cannot disown the 'motherhood' of Sanskrit. For example, the 'widow' and the 'widower' that respectively derive their existence from 'Vidhavaa' and 'Vidhurah' cannot be simply explained away as these belonging to "Sabda saadri-Syam".

It is interesting to note that the poet has pointed out how the consonant-ending language has contributed to musical expression and expressiveness, by changing into a vowel-ending one. In this connection it is not out of place to dispel the popular misconception about the 'loveliness' of the two languages, in the saying 'Telugu is the Italian of the East'. The truth is that the two languages are compared to each other because they happen to be vowel-ending : e. g. John' is 'Gievanni' in Italian and 'Yohaanu' in Telugu; the English 'bank' is 'bance' in Italian and

'baanku' in Telugu. What Telugu is to Carnatic music, Italian is to the Western music, as you see the musical terminology (e· g. 'alto') taken from the language.

This poetic composition is at once a literary and linguistic treat to the discerning reader, and should be hailed as the first and foremost of its kind in Telugu.

Rajahmundry **R. M. Challa**



# కృతజ్ఞత

'వాగనుశీలనం' పద్యాలు ముందుగా ముద్రితమైనా వివృతి ముద్రణం ఆలస్యమైంది.

అడిగినంతనే తమ అమూల్యమైన అభిప్రాయాల్ని ఆంధ్రాంగ్ల భాషల్లో వ్రాసి యిచ్చిన ఆచార్య కోరాడ మహాదేవశాస్త్రి గారికి, ఆర్. యస్. చల్లా గారికి మా కృతజ్ఞతాభివందనాలు.

ఈ కృతి సంకితంగా స్వీకరించటానికి వాత్సల్యంతో అంగీక రించిన పరమ గురువర్యులు ఆచార్య గంటిజోగి సోమయాజులు గారికి నమోవాకాలు.

పుస్తక ముద్రణం ముచ్చటగా నొనర్చిన శ్రీ లక్ష్మి ప్రెస్ బ్రహ్మయ్య గారికి అభినందనాలు.

శ్రీమతి కె. గిరిజాలక్ష్మి



గ్రంథకర్త :

డాక్టర్ బొడ్డుపల్లి పురుషోత్తం



వివృతికర్త్రి :

శ్రీమతి కె. గిరిజాలక్ష్మి, యం.ఏ., యం.ఫిల్.

భారత ప్రభుత్వాఖిల భాషా సాంకేతిక పద నిర్మాణసంఘ
మాజీ అధ్యక్షులు

ఆంధ్ర విశ్వకళా పరిషదాంధ్ర సంస్కృత మాజీ శాఖాధిపతులు,
విద్వాన్, కళాప్రపూర్ణ

**ఆచార్య శ్రీగంటి జోగి సోమయాజి**
యం. ఏ., యల్. టి.,

మహోదయులకు

# కృతి సమర్పణము

'ఆంధ్ర భాషా వికాస' నీరంధ్ర కీర్తి
సంస్కృతాంధ్రాంగ్ల ద్రవిడ భాషల మనీషి
నిత్య పరిశోధ నోన్ముక్త నిశిత బుద్ధి
సుకృతి శ్రీగంటికుల జోగి సోమయాజి॥

జ్ఞానమున దక్క తక్కు రంగముల యందు
పొదుపు పాటించి పండించె బ్రతుకు నంత;
శాస్త్ర వాఙ్మయ విద్యా విశారదుండు
సోమ సన్నిభు డాచార్య సోమయాజి॥

పరుష శబ్దమ్మె రాని సంపన్న వాగ్మి
శిష్య వాత్సల్య భావ సుస్నిగ్ధ మూర్తి
గురువరా! యని వందింప పరవశించి
శిష్య కోటిని ప్రేమ నాశీర్వదించు॥

కోరడేనాడు నెట్టి సత్కారములను
శిష్య విశ్వాస మేని వాంఛింప డెపుడు
న్యాయ మార్గ సమార్జనాయత్త ధనుడు
వేయి మాసాల పూర్ణ జీవిత తపస్వి॥

పిల్చి పరిశోధనము సేయ విషయ మొసగి
జీవితము ధన్యమగుటకు త్రోవ జూపె
అట్టి గురుదేవులకు కృతి నంకితమ్ము
గా నొనర్చుట కన్నను కలదె సుకృతి?

వ్యాకరణ శాస్త్ర గత రహస్యము తెలిసింగి
ఆధునిక శబ్ద శాస్త్ర సమన్వయమున
నేడు బోధింపవలెనని నిర్ణయించు
మార్గదర్శి కర్పింతు నా మానసమ్ము॥

ఆంధ్ర శాఖాధిపతికి లభ్యమ్ముగాని
పెక్కు పదవుల చేబట్టి చక్కదిద్ది
అఖిల భారత స్థాయి విఖ్యాతి గన్న
సోమయాజికి కృతి నిచ్చు సుకృత మబ్బె॥

సతత వాగను శీలనాసక్త మతికి
చిత్రమౌ కృతి వాగను శీలనమ్ము
గురు వరుల కంకితం బౌన గూర్తు భక్తి
దేవి శారద యాశీర్వదించు నన్ను॥

ఔర! యెనుబది రెండేండ్ల యువ గురుండు
జ్ఞాన తేజో విరాజియై మౌన ముద్ర
వృద్ధ శిష్యాభివృద్ధి కాంక్షించు కతన
అభ్యుదయ పరంపరలు సంప్రాప్త మగును॥



# పరిచయం

జననం : బాపట్ల (గుంటూరుజిల్లా) 1-7-1927

అధ్యయనం : ఆంధ్ర విశ్వకళాపరిషత్

అధ్యాపకత్వం : చీరాల, బాపట్ల కళాశాలలు

ఆంధ్ర విశ్వకళాపరిషత్ పి. జి. సెంటర్, గుంటూరు.

నాగార్జున విశ్వవిద్యాలయం

ముద్రిత రచనలు : యుగపురుషుడు, విశ్వకవి (జీవిత చిత్రణ)

కుసుమాంజలి (పద్యసంకలనం)

మన సారస్వతం (తమిళ, కన్నడీకరణం)

మహోదయం (చారిత్రక నవల : ఆంధ్ర విశ్వకళాపరిషద్బహూకృతి, ప్రచురణ)

తెనుగు వ్యాకరణ వికాసం Vol. I & II (సిద్ధాంత గ్రంథం)

సత్యం శివం సుందరం (పద్యకృతి)

Truth, Bliss & Beauty (ఆంగ్లీకరణం)

కాళిదాస కవిత (సారస్వత విమర్శ, ద్వితీయముద్రణ)

వ్యాకరణ కోశం (తెలుగు అకాడమీ ప్రచురణ)

మానిషాదమ్ (సాంస్కృతిక నాటికలు)

భాషాశాస్త్ర పరిచయం

బాలవ్యాకరణ వికాస వ్యాఖ్య (ద్వి. ము.)

వాగనుశీలనం (పద్యం)

ఆక్రందన శతకం (పద్యం)

కవియోగి పోతన (గేయరచన)

అఖిల మానవ హృదయాంతరాళములను
వాసనా మాత్ర సూక్ష్మనివాస ముండి
వ్యక్తి భాషణ వైవిధ్య వర్తిని యగు
సకల భాషానుగత సరస్వతికి నతులు॥

హృదయ సారము మనసున పదిల పడగ
సకల మానససారము సరసవాక్కు
నందె రూపొందు నన్న సత్యము నెఱింగి
భావ గంభీర పద సరస్వతిని గొలుతు॥

ఏ దసత్యమో? సత్యము నేదొ తెలిపి
చీకటులచీల్చి కాంతి నిచ్చెడిది యెద్ది?
మృత్యువును బాపి యమృతత్వ మిచ్చునెద్ది?
అటి శబ్ద ముపాసింతు నహరహమ్ము॥

శబ్దమే తల్లి, తండ్రియు శబ్దమగును,
శబ్దమే యొజ్జ, బంధువు శబ్దమగును,
శబ్దమే విద్య, కలిమియు శబ్దమగును,
వరలు శబ్దమె జనుల సర్వస్వమనగ॥

శాసనముసేయు ప్రభువుగా శబ్దవితతి
స్నేహితునిరీతి హితవు వర్షింపగలదు
కాంతలను మించి యతిమనోజ్ఞమ్మునగును
తగు నుపాసింపనట్టి శబ్దము సతమ్ము॥

ప్రాణశక్తి సమస్తము వాక్కునందె
మానవున కుండు, కావున మౌని యగుట
ఆర్షలక్ష్యమ్ము; అయిన నత్యంత విహిత
రమ్య వాగ్విలాసమ్ము హిరణ్మయమ్ము॥

సత్యమె వచింపవలయును; శాసనము నదియ;
అయిన పేర్కొనదగును ప్రియమ్ముగదుర;
అప్రియమ్మగు సత్యమ్ము ననభిహితము;
ప్రియహితమ్మగు సత్యమే పేర్మిగూర్చు॥

శబ్దమే తల్లి, తండ్రియు శబ్దమగును,
శబ్దమే యొజ్జ, బంధువు శబ్దమగును,
శబ్దమే విద్య, కలిమియు శబ్దమగును,
వరలు శబ్దమె జనుల సర్వస్వమనగ॥

శాసనముసేయు ప్రభువుగా శబ్దవితతి
స్నేహితునిరీతి హితవు వర్ణింపగలదు
కాంతలను మించి యతిమనోజ్ఞమ్మునగును
తగు నుపాసింపనట్టి శబ్దము సతమ్ము॥

ప్రాణశక్తి సమస్తము వాక్కునందె
మానవున కుండు, కావున మౌని యగుట
ఆర్షలక్ష్యమ్ము; అయిన నత్యంత విహిత
రమ్య వాగ్విలాసమ్ము హిరణ్మయమ్ము॥

సత్యమె వచింపవలయును; శాసనము నదియ;
అయిన పేర్కొనదగును ప్రియమ్ముగదుర;
అప్రియమ్మగు సత్యమ్ము ననభిహితము;
ప్రియహితమ్మగు సత్యమే పేర్మిగూర్చు॥

ప్రాచ్యు లాలోచనము గూడ భాష యనగ
బాహ్యమైన యాలోచన భాషయందు
రన్య, లీరెండు తగును సమన్వయింప
నిత్య వాక్కన నొకటి; యనిత్య మొకటి॥

నిత్యవాక్కనె 'స్ఫోట'గా నిర్ణయించె
భర్తృహరి మహాశయుడు నిర్ద్వంద్వముగను,
స్ఫుటము చెందును గావున స్ఫోటమాయె;
వర్ణపదవాక్యముల స్ఫోటప్రస్ఫుటించు॥

ప్రాంతవాసులు తమ మనోభావములను
ప్రకటనము చేసికొనగ పరస్పరమ్ము
వాడుకొననగు పనిముట్టు భాష; అదియు
కంఠగతమగు ధ్వనుల సంఘాతశక్తి॥

ధ్వనుల చేతనే భావముల్ ప్రకటితమ్ము
లయిన నంగ విన్యాసమ్ము లవసరమ్మె;
ప్రాథమికమైన యాంగిక భాషపట్ల
ఆదరమె నేటికిని మానవాళి కెందు॥

దైవదత్తమా? సంపాదితమ్మ? భాష
క్రమవికాసమా? సహజమౌ క్రమమ యెద్ది?
అందరకు నేకరీతి సంప్రాప్తమగుట
అంతరము భాష; బాహ్యాదోహదము పరగు॥

దైవదత్తమె భాషైన ధాత్రియందు
మనుజులకు నేకభాష సంప్రాప్త మగును;
నాల్గువేల భాషలను, మాండలిక భేద
ములను లెక్కింపనగునె? యా నలువకైన॥

వానరములు కావించెడి ధ్వనుల కన్న
మనుజు లొనరించు మరికొన్ని ధ్వనులు మిన్న
కాన మానవభాషను క్రమవికాస
మని తలంచుట పొసగ దెట్లన్న వినుడి॥

నరులవలె పెక్కు గతుల వానరములెపుడు
వర్ణ సమ్మేళనముచేత భావపరిధి
పెంచుకొనజాల; వట్లె తగ్గించుకొనవు;
పరిమితోక్తులు కావుసూ భాషయనగ॥

భాషపుట్టుకపై గల వాదములను
ధాతువాదమె యర్థవంతమ్ము కొంత;
బర్మ చైనాదులందు నిప్పటికి కూడ
ధాతువులె వాడబడు పదాల పగిది॥

వ్యక్తి భాషించు హేతువు ప్రతిభ యని వ
చించె భగవానుడైన భర్తృహరి మున్ను;
కావ్యహేతువు ప్రతిభయే; కాన నరుడు
ప్రతిభనొరపిడి పెట్టుచో ప్రాజ్ఞు డగును॥

మాటలాడంగజేయు సామాన్యప్రతిభ
సృజనగావింపజేయు విశేషప్రతిభ
లలితకళల గాఢాసక్తి గలుగజేయు
ప్రతిభ పేరొ న భావసంబంధ మగును॥

క్రమముగా భావుకత వృద్ధిగాంచు కొలది
శబ్ద సమ్మేళనముచేత సరసకవిత
అంగవిన్యాసములచేత నభినయమ్ము
మొదలుగాగల కళలు రూపొందె మిగుల॥

తగ వివక్షయె భాష కాధార మగుట
అది యనంత ముఖమ్ముల వ్యాప్తిగాంచు;
వ్యక్తి భాషణ బట్టి చేయంగ బడిన
వర్ణన సమగ్రమనెడి భావంబు తగదు॥

పలుకరింపు చేతనె గుర్తుపట్టగలరు
వ్యక్తులను వారి పేళ్ళతో నంధ జనులు;
పలుకుబడియె సరస్వతి; ప్రతి ముఖాన
భిన్న భిన్న రీతులతో ప్రసన్న మగును॥

భాషయను జ్యోతి లేక ప్రపంచ మెల్ల
అంధకారమయం బగు ననియె దండి;
తరగడది, యారి పోదు, సంతతము వెలుగు
సూర్యచంద్రులు దీనికి జోడుగారు॥

వ్యక్తి భాషింప నిర్దేశమైన యంగ
మొక్కటియు లేదాతని యొడలు నందు;
రుచుల నెరుగుచు నాహార పచనమునకు
సహకరించెడి నాల్క, భాషకు చెలంగు॥

తగ ప్రసంగించి బిడ్డలో దాగియున్న
భాష నావిష్కరింపంగ పాటుపడెడి
ప్రథమ గురువు తల్లియె, మానవాళి కెందు;
మాతృదేవి యన్ని విధాల మాననీయ॥

మాతృభాషయు, మాత, సంస్మరణ మాత్ర
హృదయ ముప్పొంగు; కడుపులకించు నొడలు;
పరిచయం బెక్కు డౌట నవజ్ఞచేసి
ఆదరింపని యజ్ఞతచే దపింతు॥

ధర్మమును ప్రజాభాష బోధన మొనర్చి
అధిక ప్రాముఖ్యమిచ్చిన యగ్ర గామి
పూజనీయుడు గౌతమ బుద్ధుడగుట
అమ్మహాత్ముని దలతు భాషానురక్తి॥

అమ్మ నుడులుండ నన్య పదమ్ములందు
ఆదరము చూపు టదియు సభ్యతయె నేడు?
కన్నతల్లిని బాధించి పిన్న తల్లి
పట్ల గౌరవముంచుట భావ్యమగునె?

అల్పవర్ణాళితోడ ననంతగతుల
వ్యక్తమగు భాష, వ్యవహర్త వక్త్రమందు;
కానరా దేవిధమగు శిక్షణముగాని;
చిత్రరీతి సంభాషించు శిల్పినరుడు॥

పశువువలెబుట్టి, పశువుగా పలు విధాల
సంచరించు మానవుడు భాషించు కతన
పశువు కన్న మిన్నగ గౌరవమ్ము గాంచ
నగును, భాషించు పశువను ఖ్యాతితగదు॥

పశువు కొకదెబ్బ, నరునకు పలుకె చాలు
ననెడి లోకోక్తి తలక్రిందులాయె నౌర!
పశువులే నయ మాలించు పలు కొకింత;
మానవునకు గట్టిపడె చర్మము క్రమాన॥

నరుడు వాగ్మియై ప్రజల మన్ననల బొందు,
మౌనియై లోకమందు సమ్మాన్యుడగును,
వాగ్మి యెపు డౌట? మౌనియై వరలు టెపుడు?
రెండు నెరిగిన వాడె ధీమండనుండు॥

వాక్కుచేతనే నరుడు ప్రాభవముగాంచు,
వాక్కుచేత నాతడు పరాభవము నందు,
మానవాళి సంస్కృతికి సంపన్న వాణి
స్వచ్ఛదర్పణ మనగ ప్రశస్తిగాంచె॥

కనక కేయూర హార కంకణము లేని
నవ్యవస్త్ర సుపుష్ప గంధాదులేని
భూషలేయగు, నరుడు వాగ్భూషణము సు
భూషణమ్మని దాల్ప నుత్ఫుల్ల మతిని॥

అవని గోజాతి యరచు నంబా యటంచు
కోకిలలు సేయు కుహూకుహూ కూజితముల
ఏనుగులు ఘీంకరించును, కాని నరుని
కంఠనిస్వనమేల యేకమ్ముకాదొ?॥

ధ్వనులొనర్చు తిర్యక్కులు తనువు నిల్ప
బహు ముఖ ప్రయోజనమ్ముల బడయగోరి
పరగు మానవ కంఠ నిస్వనము, లందు
ఉన్నతతమము కావ్య ప్రయోజనమ్ము॥

పుడమి నొక్కటిగా తలపోయు నరుల
ధ్వనులు ప్రాంతీయమై బోధపడ వొకింత
పశువు లొనరించు ధ్వనులు ప్రపంచ మెల్ల
నొక్క గతి నుంట యాశ్చర్య మొదవు గాదె॥

నరుల నేకం బొనర్చు యత్నములు జరిగె,
కృతక భాషలు కొన్ని నిర్మింపబడియె,
ఏలకో! వాని మాటాడ జాలరైరి;
యాంత్రికము కాదు పో! మానవాళిభాష॥

భాషలోగల యుద్రిక్త భంగిమలను
కాకువుల, నూనికలను, తగ గ్రహింప
ప్రజల మధ్య జీవించుచో వ్యక్తికొదవు
అన్య భాషాభి భాషణమం దుపజ్ఞ॥

ప్రజలు మాటాడుటనుబట్టి భాషలగును,
పరులు శాసింప భాషలేర్పడ వొకింత;
'ఒప్పు' 'తప్పు'ను మాటలు చెప్పరాదు;
అర్థమగునంత మేరకేదైన నొప్పు॥

భాషలనుగూర్చి భేదభావంబు తగదు;
భాషకొక్కొక్కరీతి లోపములుగల్గు;
ఘనతకెక్కిన సంస్కృతాంగ్లముల యందు
ఏల యన్నదమ్ముల్ను పదాలులేవొ?॥

భాషలం దుచ్చనీచ భావములు తగవు;
భాషలన్నిట తగు కట్టుబాటు కలదు;
దాని వర్ణించునదియె శాస్త్రంబనంగ;
పాణిని మహర్షి మనకట్టి పథమునూపె॥

శిష్టజనులు మాటాడు భాషే సమస్త
భావ నిచయోపయోగి కావలయు నంచు
ఆగ్రహించి కడకు విజయమ్ము గనిన
గిడుగు రామమూర్తికి నమస్కృతు లొనర్తు॥

పాణినీయము వల్లింప పాటుపడిరి
ద్వాదశాబ్దులు భారతవర్షమందు;
పాణిని మహర్షి భాషాభివర్ణనమున
ప్రతిభులైరి ప్రతీచివిద్వాంసు లిపుడు॥

నిశిత మానవ మేధకు నిరుపమాన
నిర్మల నిదర్శనము పాణినీయ మనియె
పండితుడు 'బ్లూముఫీల్డు', తద్వర్గమెల్ల
పాణినికి శిష్యులట్లు భావన మొనర్చు॥

తాను పాణిని యట్లు శాస్త్రానుకూల
పద్ధతులబట్టి భాషల వ్యాకరింప
ప్రతిప్రతీచి విద్వాంసుడు పరితపించు,
అంతటి సమగ్రబుద్ధిగా నారటించు॥

ప్రాచ్యుడైన వ్యాకర్త శబ్దప్రధాని;
కాని పాశ్చాత్యు డర్థప్రధాని యగుట
ఆధునిక శబ్దశాస్త్రజ్ఞు డాదరించు
భారతీయ సశాస్త్రీయ సారమతిని॥

అధిక విద్వాంసులైరి వైయాకరణులు
శబ్దవర్ణన విభజన శాస్త్రసరణి;
అధమ విద్వాంసులైరి వైయాకరణులు
శబ్దశాసన కృతక సంస్కార సరళి॥

వాక్యమే భాషకంతకు ప్రాతిపదిక;
పద మపోద్ధార మొనరించి పడయ నగును;
అర్థవంతమె పదమైన నందులోని
వర్ణమున కెంత పాలని నిర్ణయమ్మొ?॥

అర్థవంతము పదము, సమన్వయమున
వాక్యమేర్పడు ననియెడి వాదమొకటి;
వాక్యమే యర్థవంతము; పదము దాని
నుండి వేర్పడు ననువాదమొండె కలదు॥

అభిహితాన్వయ వాదమ్మొ; నన్వితాభి
ధాన వాదమ్మ లివియె; యవ్వానియందు
పండితామోద మందె నీ రెండవదియె;
ఆదరింతురు తొలి దాని నాధునికులు॥

అర్థమొసగు శబ్దములు పదాంశములగు;
రెండు విధముల వాని గుర్తింప నోపు;
స్వేచ్ఛగల వనిబద్ధముల్; స్వేచ్ఛలేని
బహు పదాంశములు తగు నిబద్ధములన॥

పదములను పదాంశము లనవచ్చు గాని
పరగవన్ని పదాంశముల్ పదములనగ;
అర్థమిచ్చు వర్ణమును పదాంశ మగును;
అధిక సంఖ్య పదాలె పదాంశములకు॥

తగ నభావము నొకభావమగు నెరుంగ;
అట్లె సపదాంశములను శూన్యంబు నొకటి;
శూన్య సపదాంశముల చెప్పు చూపినట్టి
నేర్పరిగ పూజలందె పాణిని మహర్షి॥

పలు సవర్ణాలు కల్గి యొవర్ణమొప్పు;
అట్లె సపదాంశములతో పదాంశ మొప్పు;
ధ్వని సవర్ణ వర్ణపద పదాంశములకు
తగును సపదాంశములకు భేదము నెరుంగ॥

ప్రత్యయము గాని, కేవల ప్రకృతిగాని
వాడనేరా దనెడి కట్టుబాటు కలదు;
ప్రకృతి కొక ప్రత్యయమె యనుబంధమగును;
తక్కినవి యాగమమ్ములు పెక్కు చేరు॥

ప్రకృతికే యన్ని యర్థాలు, ప్రత్యయమ్ము
వాని నావిష్కరించునన్ వాద మొండె;
ప్రకృతికిని ప్రత్యయమునకు వలదు భేద
మని పదాంశము కల్పించి రాధునికులు॥

ప్రత్యయ చరిత్ర తెలిసిన భాషలనుచు
ప్రత్యయ చరిత్ర తెలియని భాషలనుచు
ప్రత్యయ స్పర్శ సోకని భాషలనుచు
ప్రత్యయాధార భాషా విభాగమొప్పు॥

ప్రత్యయాల సమ్మేళన ఫణితి పట్టి
ఎల్లభాషల వర్గీకరింప నగును;
గొలుసు కొక్కాలరీతిగా కొన్నిగూడు;
గట్టిగా గొన్ని ప్రకృతుల కలిసిమెలగు॥

వ్యాకృతియెలేని భాషావిభాగమొకటి
వ్యాకృతికలట్టి భాషావిభాగమొకటి
వ్యాకృతు లనేకముల్ గల వర్గమొకటి
ఇట్టి విభజన మొప్పు వ్యాకృతినిబట్టి॥

నాగరక మనాగరక మనంగ రెండు
విధములుగ నొప్పు భాషల వింగడింప;
పరగ వాఙ్మయమున్న నాగరక మౌను;
నాగరకు లాడు భాషలు నాగరకమె॥

కల వసంఖ్యాక మౌ యనాగరక భాష
లట్టి వానికి లిపి వాఙ్మయముల గూర్చి
నాగరకము గావించు యత్నమ్ము వలయు;
అదియె శబ్దశాస్త్రజ్ఞుల యాశయమ్ము॥

చెలగు వాక్కున భాషా సజీవశక్తి
వ్రాతలో కోలుపడు కొంతప్రాణ పటిమ
భారతీయుల ప్రాచీన వాఙ్మయమ్ము
మౌఖికమె యౌట మిగుల సమ్మాన్య మిపుడు॥

అట్టి వాఙ్మయ పరిరక్షణార్థ మొదవె
ప్రాతి శాఖ్యలు, శిక్షలు, వ్యాకృతులన;
స్వరములో భేదములు దానికొరకె కల్గె
స్వరము నొకవరమగు వేదభాషయందు॥

వర్ణమున కర్థమిది యను నిర్ణయమ్ము
సమ్మతముగాదు నేటి శాస్త్రజ్ఞ తతికి;
అర్థభేదనమందు సమర్థమైన
ధ్వని విశేషమె వర్ణ మవ్వారి మతికి॥

అర్థభేదమ్ము గూర్చని యట్టి ధ్వనులు
భాషలన్నింట నుండు నపారముగను;
'కారమ'న, 'ఖారమ'నగ నొక్కటి తలంప;
పరగు నివి యప్రధానమౌ ధ్వను లనంగ॥

ధ్వనులు కొన్ని పరస్పరాభావమందు
వర్తిలుచునుండు, నవియొక వర్ణమౌను;
'మామ' 'మావన'; 'మామిడి' 'మావిడన'గ;
ఇట్టి ధ్వను లప్రధానములే యెఱుంగ॥

వర్ణములలో ధ్వనులు పరస్పర మభావ
మందు వర్తిల్లుచుండు; నన్యములు స్వేచ్ఛ
గా ప్రవర్తిల్లు-'కద్దరు', 'ఖద్ద'రనగ;
కాంచనగు నివి వర్ణవిజ్ఞానమందు॥

'కంప' 'గంపన'; 'కాలము' 'గాల'మనగ
అర్థభేదమ్ము గల్గి యేకాంశమందు
చెలగు నివి కనిష్ఠ పదయుగళము లౌచు;
వర్ణముల నిర్ణయింప తోడ్పడెడి జతలు॥

వర్ణములయం దనేకమౌ ధ్వనులు చేరు;
ధ్వనులు లిపిలో నిరూపింపబడుట యరిది;
పొందుపడు వర్ణలేఖనమందె పొదుపు;
ధ్వని విధేయ లేఖనము శాస్త్రజ్ఞుడెరుగు॥

కాకువూనిక వ్యవధాన కలితమైన
వర్ణములుగాని వర్ణముల్ నిర్ణయింప
శ్రద్ధగలవారు నేటి శాస్త్రజ్ఞులెల్ల;
భాష కవియె నిజానికి ప్రాణశక్తి॥

ద్వ్యర్థి కావ్యోపయుక్తమై వ్యాప్తిగన్న
అల సభంగ మభంగము లనెడి శ్లేష
లిపుడు వ్యవధాన భేదము లిట్లుతెలియ:
'తెలిసి, తెలియ'నట్లు; 'తెలిసితెలియ'నట్లు॥

వ్యంజ నాభివర్ణనమందు ప్రాచ్యుల కృషి
స్వర విభాగమునందు పాశ్చాత్య కృషియు
ఆకలించుకొనినచో సమగ్రమైన
ధ్వని పరిజ్ఞానమంది శాస్త్రజ్ఞుడగును॥

కాంక్ష పరిసమాప్తమగు వాక్యములు కొన్ని;
కాంక్ష పరిపూర్తిగాని వాక్యాలు కొన్ని;
'అక్కటా! నాథ!! మిముదూర న్యాయమ'నగ;
'అకట! నాథ!! మిమ్ములదూర న్యాయమొ?'యన॥

అన్ని భాషలలోన నత్యధికసంఖ్య
కాంక్ష పరిపూర్తియైన వాక్యములె పరగు;
అన్ని భాషలలోన నత్యల్పసంఖ్య
కాంక్ష పరిపూర్తిగాని వాక్యములె చెలగు॥

వాక్య పరివర్తనముచేత 'వక్తు రిచ్ఛ'
ఎట్లు వర్తింపగలదొ యూహింప నగును;
కర్మ కరణ సహార్థాది కారకములు
తగిన భంగి వాక్యమున ప్రాధాన్యమందు॥

వక్త్రముఖమున 'వైఖరీ' వాక్కు పరగు;
శ్రోతహృది 'మధ్యమా' వాక్కు చోదితమగు;
మునులలో 'పరా' 'పశ్యంతి' యనెడి వాగ
తీత దృశ్య శక్తులు తపోద్దీప్తిగాంచు॥

యువగురువు, వృద్ధ శిష్యులోహో! యదేమొ
వట తరువుమూల జనిరి తత్త్వము భజింప;
మౌనముపహించె గురువు; వ్యాఖ్యాన మదియె;
శిష్య సంశయ వితతి విచ్ఛిన్నమాయె॥

అంతరంగము, బాహ్యమై వ్యాకరణము
రెండు విధముల నొప్పి ప్రేరేచు ప్రజల;
అంతరంగ మవ్యక్తము; వ్యక్తమగును
బాహ్యమున కొంత; రెండును వలయు తెలియ॥

భావమొక్కటి, పెక్కు రూపములు దాల్చు;
ఒండు రూపంబు; భావముల్ రెండు, మూడు;
వ్యక్త మవ్యక్తమైన వాగర్థములను
ఎరుగ వచ్చును రెండు వ్యాకృతులవలన॥

కత్తితో నరికె ననగ, కత్తిచేత
ననగ కరణార్థమున రెండు పనికి వచ్చు;
చనియె రాముతో; నతనితో సరియనంగ;
ఒక్క శబ్దమె రెండింట చక్క నొదవు॥

భాష తెలియనివాడు తద్భాష గూర్చి
ఏటి పరిశోధన మని గర్వింపనగునె?
శబ్దశాస్త్రజ్ఞుడనగ భాషావ్యవస్థ
సూక్ష్మ సూక్ష్మాంశముల పాఱజూచు దిట్ట॥

భాషబోల్పనగు మహాప్రవాహ; మట్టి
దాని నెదురీద మాటాడు వానికగునె?
మమతలేనివానికె దాని మర్మ సరళి
పట్టువడు సంతత శ్రవణ, ప్రవణమునను॥

శబ్దశాస్త్రమనెడి మహాసౌధమునకు
ధ్వని పరిజ్ఞానము పునాది; దానిపైన
తగును నిర్మింప బహువిధాంతస్తులెన్నొ;
సౌధసౌందర్య గరిమ కుపాధు లవియ॥

ధ్వని పరిజ్ఞానమున్న ఛందస్సులోని
యతుల ప్రాసల దోహదగతులె గాక
ఒక్క జాతికిచెందిన పెక్కు ధ్వనుల
ఆవృతుల యందచందము లరయ దగును॥

ధ్వనులలో ముఖ్యమైనవి వర్ణములగు
లిపులు వానికె సరిగ కల్పింప నోపు
యంత్ర నిర్మాణమునకు వర్ణాత్మకమగు
లేఖన మనువు; పొదుపు కల్గించు మిగుల॥

కంఠ్య మూర్ధన్య తాలవ్య కల్పనమున
స్థాన కరణమ్ములందు శాస్త్రజ్ఞులెపుడొ
స్థానమునకె ప్రాధాన్యమొసంగినారు;
తుల్య పరిగణనమ్మె యాధునికరీతి॥

పదమునకు నర్థమెట్లు సంప్రాప్తమగునొ
ఎంత ధీమంతులైన గ్రహింపలేరు;
అర్థశబ్దాలమైత్రి యనాది సిద్ధ
మని వచించిరి ప్రాచ్యవైయాకరణులు॥

అయిన నర్థవిచారణో వ్యర్థమనుచు
అర్థనిరసనసేయ భావ్యంబు గాదు;
అర్థనారీశ్వరులుగ వాగర్థములను
తగ నుపాసించు టొప్పుతత్త్వము నెరుంగ॥

కావ్యభాషయు నభివృద్ధిగాంచనోపు
ప్రథిత జనతా నిరూఢశబ్దములచేత;
భాష నరికట్టు దృష్టి భావ్యంబుకాదు
ఎపుడు మడికట్టుకొని బ్రదుకీడ్వ తగదు॥

నీటి నరికట్టి పంట పండింపవచ్చు
భాష నరికట్టి పండునే భావవితతి?
జటిలమైనదికాదు భాషావ్యవస్థ
మృదులముగ కట్టువడుచు వర్ధిల్లునదియ॥

ప్రతి పదోక్త లాక్షణిక మార్గమ్ము లందు
సులభమాయె లాక్షణికమ్ము సూత్రగతిని;
పెక్కు భాషా వ్యవస్థల విధులెరుంగ
వంశపద్ధతికేర్పడె వ్యాప్తినేడు॥

4) 894.810 P.U.R. 25 Acc. no. 8

వేయి దివ్యసంవత్సరాల్ వేల్పుఱేడు
అభ్యసించె సంస్కృతము బృహస్పతి కడ
ప్రతి పదోక్త పద్ధతి; కాని పడయ డంతు;
ఇర్వురకుగూడ విసుగు జనించియుండు॥

లాక్షణిక మార్గమందు హాలప్రభుండు
ఆఱుమాసాలె సంస్కృత మభ్యసించి
పండితుండాయె నల శర్వవర్మ కృపను;
లక్షణమున సూక్ష్మమునందు మోక్షమొదవు॥

పెక్కు పదములతో పలువిధగణాల
నేర్పరుపనోపు వ్యాకర్త నేర్పుమీఱ;
ప్రతి పద పరిశోధకులు శబ్దజ్ఞులిపుడు;
లక్ష్యములు మారుచుండు కాలమును బట్టి॥

ఎట్టి శాస్త్రజ్ఞుడేని సాధింప వలయు
దోష విరహిత లక్షణోద్ద్యోత శక్తి;
అది యతివ్యాప్తమవ్యాప్త మగుట తగదు
శాస్త్రము సమగ్ర లక్ష్యలక్షణమె సుమ్మ॥

అంతరాంతర ధర్మ సామ్యములబట్టి
ఒక్క కుదురుకు జెందిన పెక్కు భాష
లోలి సోదర భాషలై యొక కుటుంబ
మనెడి వ్యవహారమునకు నర్హంబ యగును॥

భాషల కుటుంబకతను నేర్పరచునపుడు
ధ్వనులు, వ్యాకరణాంశముల్, వాక్యములును
చిర తపశ్శీలతను సమీక్షింపవలయు;
తగదు సిద్ధాంత మమత శాస్త్రముల యందు॥

భాషలకు జన్యజనక సంబంధములను
నిర్ణయింప భాషాశాస్త్ర నేతకె తగు;
శబ్దసాదృశ్య మున్నంత సాహసించి
పుట్టుకలబట్టి చూపిన పుట్టునగవు॥

తెలుగు 'మూతి'ని 'మౌత్' నుండి కలిగెనన్న
'నీటు' తెలుగున నాంగ్లపు 'నీటె' యనిన
'ప్రాప'నెడి నుడి యాంగ్లసంభవమె యన్న
నవ్వు పుట్టదె యల్పవిజ్ఞానికేని?॥

ఆంధ్రము జనించె పూతమౌ యమరవాణి
నని వచించిన కల్గు ప్రఖ్యాతి యంచు
ఒక మహాత్ముడు గావించె నోర్పుమీర
త్రాడు బొంగరాల్ లేని సిద్ధాంతములను॥

దేశమును జీల్చగా దురుద్దేశ్య మొదవి
వ్రాసె కాల్డ్వెలు ద్రావిడ వ్యాకృతన్న
పండితారోపణమ్ము సంభావ్య మగునె?
శాస్త్రరచనలు విషయవాస్తవము కోఱకె॥

ద్రావిడము కూడ నొక ప్రాకృతమ్మె యనిన
అంతమాత్ర పరిష్కారమా? యదెట్లు?
ప్రజలు మాటాడుటనుబట్టి ప్రాకృతమ్మె;
యౌగి కార్థమునందు ప్రయోగ మిదియు॥

ప్రాకృతములందు దేశ్యశబ్దములు గలవు
ద్రవిడభాషల దేశ్య పదాలు కలవు
ప్రాకృతమ్ములు సంస్కృత భవములైన
దేశ్యములబట్టి ద్రవిడ ప్రత్యేకతేల?॥

పైకి వాదమెగాని యాభాస మిదియు
ఇట్టి భ్రమకల్గు నామసాదృశ్యమందు;
ప్రకృతు లెరుగని దేశ్యముల్ ప్రాకృతముల;
ద్రవిడ దేశ్యాలు సుప్రసిద్ధము లెఱుంగ॥

ద్రవిడదేశ్యాలు ప్రచ్ఛన్న తద్భవములె
అతి పరోక్ష వృత్తిని పరిణతిని గాంచె
ననెడి వాదమ్ము పొసగ దావంతయేని
అరయనగు వీని ఘటన ప్రత్యక్ష వృత్తి॥

సంస్కృతోక్తులు బహు సహస్రాధికముగ
ద్రవిడభాషల జేరె సత్యమది, కాని
ద్రావిడోక్తులు కొన్ని శతమ్ములైన
చేరె గీర్వాణి నన విశ్వసింపరేల?॥

ధాతు వస్పష్టమైన పదంబు గాని
బహుళ రూపాలు పొందని పదమయేని
సంస్కృతము నందు నన్యభాషా పదమ్మొ;
అమరభాషైన ప్రాతిదేయత్వ మొదవు॥

'మిన్'-ప్రకాశించు ధాతువు 'మీన' మాయె;
'కల్'-తెలిసికొను ధాతువు 'కళ' యనంగ
కావి యేరన కావేరుగాదె సంధి?
ద్రావిడోక్తుల నిట్లు వేర్పఱుపవచ్చు॥

ధ్వనులు మారవు తమ యిచ్చవచ్చినట్లు;
మార్పులందు వ్యవస్థ సంభవము గాన
బుద్ధిమంతులు ధ్వని సూత్రములు రచింప
స్థాయి పెరిగె భాషాశాస్త్ర సరణియందు॥

శబ్దపరిణామ రీతులు సంభవించు
అన్ని భాషలయందు సమాన భంగి;
వర్ణముల సమీకరణము; వర్ణముల వి
భేదనము; వర్ణలోపాది విధులు పెక్కు॥

శబ్దశాస్త్ర తప్పించు శాసనముసేయు
పదములవి 'సామ్య' పద్ధతి ప్రజలచేత
కల్పితమ్ము లెట్లన-సేవకత్వ శబ్ద
సరణిపట్టి యేర్పడె 'బానిసత్వ'మనగ॥

ప్రజలు పదముల కల్పించు ఫణితు లెన్నొ!
అందు 'లోకనిరుక్తి' ప్రఖ్యాతిగాంచు;
'నార్తు సింహాచలము'ను జనాళి పలుకు
నహహ! 'నారద సింహాచ' లాఖ్యతోడ॥

దేశకాలానుగుణ పరిస్థితులబట్టి
మార్పుచేర్పులు భాషసంభవము గాన
మూల భాషాతిరిక్త గుణాళిబట్టి
ఉప కుటుంబము లేర్పడుచుండు పెక్కు॥

కలుగు నుపకుటుంబాల వర్గములు కొన్ని
వర్గముల ప్రవర్తిలు నుపవర్గ వితతి;
కడకు మిగులును భాష, తద్గత సమస్త
సరళియె పునాది శబ్దశాస్త్రమున కెందు॥

పద విధాతలు పరికింప ప్రజలెగాని
కారు వ్యాకర్తలని భాష్యకారుడనడొ?
ప్రజల పదసృష్టి నాతడు వ్యాకరించు;
చెప్ప నొప్పు నిర్మాణ విశిష్టరీతి॥

ఒక్క పదమైన వ్యుత్పత్తి చక్కనెరిగి
తగిన భంగి ప్రయోగింప దక్షుడేని
స్వర్గధేనువు పగిదినా పదము సకల
కామితార్థప్రదాయి కాగలదుసుమ్మ॥

దేశ్య పదముల వ్యుత్పత్తి తెలియ దెవరి
కనెడి పూర్వ శాబ్దికుల వక్కణము తగదు;
సోదర పదాళితో పరిశోధనమున
తగ గ్రహింతురు పెక్కు పదాల జన్మ॥

'పూ' యనెడి ధాతు జనితము 'పూవు' పదము
'తోడ' నెడి ధాతుమూలము 'తోట' పదము
'పగుల'నెడి ధాతుకలితము 'పాలు' పదము
పట్టగా శక్తివలయు వ్యుత్పత్తులిట్లు॥

పాతపడిన నాణెములట్లు పదము లేని
వాడు లేమాత్రమైన భావ్యంబుగాదు;
పలుకు లోక కొన్నిభాషను తొలగిపోవు
దక్షిణోత్తరములకు పదాలుగలవె?॥

నేడు భాషాధ్యయనము సంక్లిష్ట గతుల
సాగుచున్నది వివిధదేశములయందు;
తొలుత తులనాత్మకమ్ము సత్ఫలితమొసగె;
దారిగల్గె చరిత్ర పద్ధతికి దాన
వర్ణన విధాన మిప్పుడు ప్రబలమాయె॥

జంతుశాస్త్రము, వృక్షశాస్త్రమ్ము పగిది
నిర్మితిని ప్రధానముగ వర్ణించునదియ
శబ్దశాస్త్రము; ప్రాచ్యుల సరళియిదియ;
నేడు పాశ్చాత్యు లిట్టిఫణితి భజింత్రు॥

జంతుశాస్త్రము, వృక్షశాస్త్రములయందు
వర్గ విభజనమ్మును శాస్త్రపరిధి నందె
తగును భాషల నిట్టి పద్ధతులు పెక్కు
నవ్య మార్గానుగామి మానవునిమేధ॥

బాదరాయణు డెప్పుడో వేదరాశి
ఋగ్యజుస్సామములుగ వర్గీకరించి
విపుల పరిశోధనమ్ము గావింపజేసె
నిరుపమాన విజ్ఞాన మనీషిఘనుడు॥

'శూన్య మపవాదమే లేని సూత్రమొకటి'
అని వచించిరి పూర్వ వాక్యజ్ఞులెల్ల;
'కలుగు నపవాదమం దోలి కట్టుబాటు'
అని సవాల్ నేయు సేటి వాక్యజ్ఞ వితతి॥

దేశభాష కెన్నటికైన తీర్చిదిద్ద
బడదు 'సంపూర్ణ' మనదగు వ్యాకరణము;
పట్టులే రెవ్వరైన ప్రవాహ గతుల;
లక్షణముకన్న మిన్నది లక్ష్యమిందు॥

కొండయద్దాన కనిపించు కొంచెమౌచు;
అటు లనంతము గంభీరమైన భాష
సూచితంబౌను పరిమిత సూత్రములను
వ్యాకృతిని గోచరించు నత్యల్పసరణి॥

వచనమును సూత్ర మొకటను వాక్కు తగదు;
వివిధ సంజ్ఞలు పరిభాష విధులు కలిగి
పొదుపు సాధింపబడు సూత్రముల; నొకొక్క
మాత్ర చేకూర్చు పుత్ర సంప్రాప్తముదము॥

పెద్దవ్యాకృతి లేదను నుద్ది తగదు;
మార్గదర్శకమేగాని మార్గమంత
పట్టి చూపదు వ్యాకృతి యెట్టిదైన
చిన్న వ్యాకృతి; కోశమ్ము మిన్న వలయు॥

వాక్య పరివర్తనముచే వివక్షగతుల
స్పష్టముగ గ్రహింపనగు భాషాప్రవృత్తి;
ఎటుల మాటాడునోగాక, యెటుల వ్యక్తి
మాటలాడంగ నగు, దీనతేట పడును॥

వలయు పరివర్తనాత్మక వ్యాకరణము
రచన సేయంగ శేముషీ ప్రాభవమ్ము;
దాన భాషకు గల యనంతత్వ మెఱుగ
నగును; గాన చేకూరె ప్రఖ్యాతి మిగుల॥

గౌరవములేదు మాండలికాల పట్ల;
కాని భాషన మాండలికపు సమాఖ్య;
కావ్య భాషను మాండలికాలు గలవు;
వాని వారింప జాల రెవ్వారలైన॥

తల్లిదండ్రులతోడ; నర్ధాంగితోడ;
బాలకులతోడ; నింటిసేవకులతోడ;
అన్నదమ్ములతోడ; మిత్త్రాళితోడ
ఒక్క నరుడె మాండలికముల్ పెక్కు వలుకు॥

పట్టి మాండలికాలను పటములందు
పదిల మొనరించు పద్ధతి వ్యాప్తిగాంచు;
శ్రోత్రమునకన్న మిన్నది నేత్ర పటిమ;
వలయు పదకోశ పటకోశముల వివృద్ధి॥

ఎంత భూభాగ మందు వ్యాపించె పదము
వేఱుచేయు గీతలు వ్యవహార భేద
రేఖలగును; వీని సమీకరించి నపుడు
తెలియనగు వ్యవహార మండలము లెవియొ॥

ప్రజలలో రాకపోకలు ప్రబలినపుడు
అన్ని మూలల పత్త్రికలందినపుడు
ప్రతి గృహమ్మునరేడియో శ్రుతము గాగ
తగ్గిపోవు మాండలిక భేదాలు కొంత॥

రాజధాని వసించెడి ప్రజలభాష
అనుకరణ యోగ్యమైన కారణము చేత
అదె ప్రమాణభాషయగు నర్హత గడించు;
అన్ని వ్యవహారములు దానియందె గలుగు॥

రాజకీయమ్ముగా నస్థిరత్వ మున్న
రాజధానులు పెక్కు లేర్పడుచునుండు;
దాన నాగరభాష కేంద్రమ్ము గాదు;
తెలుగుదేశాని కొదవిన స్థితి యిదేగ॥

విద్య యేప్రాంతమందు వ్యాపించు మిగుల
సిరియు సంపద లెచటసుస్థిరము ప్రజల
అట్టి ప్రాంతీయ భాషయే యన్యప్రాంత
ప్రజకు పాటింపదగు నన్ని రంగములను॥

సాగరప్రాంతవాసులు నాగరకులు
అధికసంఖ్య విద్యాధికు లగుటజేసి
అన్య మాండలికమ్ముల నతకరించి
పత్రికల వ్యాప్తిగాంచె తత్ప్రాంతభాష॥

మాండలిక మొక్కదాని ప్రమాణ మనిన
అన్యమండలవాసుల కాగ్రహమ్ము;
అధికభేదములున్న క్రియా పదాలు
గ్రాంథికములైన తగు పరిష్కార మొదవు॥

వ్యక్తికి చరిత్ర మున్నట్లె ప్రతిపదమ్ము
నందును చరిత్ర మొకకొంత యడగియుండు;
దాని నెరుగుట సకల విజ్ఞాన గరిమ;
భాష గావింపదగిన తపస్సు నదియె॥

కోశ పరిశోధనమె కాదు, దేశములను
పారజూచిన వాడెపో పట్టగలడు
శబ్దవైచిత్రి; లేనిచో సగమె యెఱక;
కోశమున కన్న మిన్నదే దేశదృష్టి॥

రూఢమును, యోగమును, యోగరూఢమనగ
త్రివిధముగ నర్థ నిచయమ్ము తెలియ నోపు;
మిన్న రూఢియె, యోగమ్ము కన్న; నయిన
యౌగి కార్థ విదులు కవియోగులెన్న॥

బురదలోనుండి యెయ్యది పుట్టెనేని
పంకజమ్మగు, యౌగిక పద్ధతిదియ;
పద్మమను నర్థమున రూఢి వడయుకతన
యోగరూఢి కుదాహరణోక్తియగును॥

విద్యలందు కుశలుడు, ప్రవీణు డనగ,
అతివ మిక్కిలి లావణ్యవతి యనంగ
నెన్న వాచ్యార్థమునకన్న భిన్నమైన
యర్థమొప్పును; నదియె లక్ష్యార్థమనగ॥

వాచ్య లక్ష్యార్థముల మించు వ్యంగ్యమొకటి
గోచరించును మిగుల నిగూఢగతుల;
అదియు సహృదయ హృదయ వేద్యమ్ముగాన
ఎంత ఘనుడైన దాని ఖండింపలేడు॥

కలదు ఘోషము గంగలోపల యనంగ
తగును వ్యంగ్యార్థ సరణి కుదాహరింప;
కృతక మిదియునుగాదు; వచింప వినమె
పొదుబస్సది జూటుమిల్ మీదననగ॥

వ్యంగ్య రామణీయక శోభ ధ్వనియనంగ
అదియె కావ్యాత్మ; భాషణ కందమదియ;
ధ్వని నెఱింగి యానందించు వ్యక్తిపైన
వాణి వర్షించు ప్రేమాభిమానగరిమ॥

శబ్దవైచిత్రి నెఱుగంగ సాధ్య మగునె?
బ్రహ్మకైనను, నల పరబ్రహ్మకైన;
సంతతోపాసనాసక్త సారమతులె
దీని శోధించి కొంత గుర్తింపగలరు॥

బాహ్య భాషా స్వరూప స్వభావములను
యంత్రములతో గ్రహించు ప్రయత్నమొదవె;
అంతరంగాన భాషా రహస్యములను
దర్శనమొనర్చె భరత విద్వాంస వితతి॥

సకల కళలకు శాస్త్రవిజ్ఞానములకు
అంతరంగమె పరమ కేంద్రాలయమ్ము;
దాని నైర్మల్యమందె యాధారపడును
ఆర్షకళలును, శాస్త్ర సమగ్రమహిమ॥

ఆంతరంగ కాలుష్యమ్ము నంతరింప
జేయుటకుగాదె యేర్పడె జీవితమున
జపతపాదులు, సత్కార్మ సాధనములు;
సాధన నశింప సర్వ నాశనము గల్గు॥

పరిహరింపంగ తగినట్టి పదమె లేదు
వృత్తి పదములు మొదలు నివృత్తిపదము
లన్నియును నెన్న దగిన వత్యంతరూఢి;
సకల సంపత్సమేత భాషాలతాంగి॥

పదము విభజించి భావమ్ము బడయనోపు;
తద్విభక్తిచే భావ చిత్రమ్ము తెలియు;
చిత్రము జనించు ననుభూతిచేత; కాన
ప్రతి పదమ్మును ననుభవ ప్రజనితమ్ము॥

వ్యస్తము సమస్తమను పదద్వయమునందు
వ్యస్తపదముల భావచిత్రాళి హత్తు;
పదము పైపద మాధారపడుటచేత
స్పష్టముద్రలుండవు సమస్తపదశైలి॥

అన్య భాషా పదాళి కాహ్వాన మిచ్చి
భాష నభివృద్ధి సేయుట వాంఛితంబె?
అన్య పదముల నరికట్టి, యనువదించు
పద్ధతిని కానిపించు నుపజ్ఞ పటిమ॥

ఇతర మాండలికమ్ము గ్రహించు టేని
ఆధునిక దృష్టిని ప్రతిదేయత్వ మగును;
అన్య భాషా పదాంశమ్ము నైన గొనుట
వ్యాకరణ ప్రతిదేయత్వ మందు రిపుడు॥

ఆమె 'పనిమంతురాల'న నందులోని
'మంత' సంస్కృత ప్రత్యయ మెంత బాగ
అతికె నో! చూడ నాశ్చర్య మతిశయించు:
అదియె వ్యాకరణ ప్రతిదేయత్వ మనగ॥

'వక్క పొడి' యను నోటితో 'చెక్క పొడ'ని
పలుకు టది యౌను నెరవు మాండలిక మనగ;
తిరిగి యొసగని వెన్నైన నెరవుగొన్న
నష్ట మేముండు? విన కొంత కష్టమౌను॥

అర్థమందు, శబ్దము నందు నహరహమ్ము
మార్పులవి భాషలందు సంభవము గాన
వాని గుర్తింపు నేర్పును బడసి నపుడె
సదవగాహన మొదవు భాషలను గూర్చి॥

అర్థ మొదవు సందర్భము ననుసరించి;
సైంధవమ్మని భోజన సమయ మందు
గురువు పేర్కొన, శిష్యుండు గుఱ్ఱ మొకటి
చక్కగొని వచ్చె భోజన శాల కౌర!!

'మోద కైస్త్రాడయ' యటంచు మొత్తుకొనెడి
చక్రవర్తిని వాక్కులో సంధి గాని
ప్రకరణంబేని తెలియని ప్రభుని, దేవి
గాఢముగ హెచ్చరింపదె 'మూఢ' యనుచు॥

కలుగు మార్పులు శబ్దార్థములను పెక్కు;
అర్థ పరిణతి యలతి శబ్దాళి కన్న;
గోచరించును-'అర్థసంకోచ' మనగ;
'అర్థ విస్తృతి'యు, 'మృదూక్తి' యనగ కొన్ని॥

'ఆల' నగ 'భార్య' యర్థము వ్యస్తసరణి
అయిన 'వెలయాలు' పేదరాల'న సమస్త
మందు చూడగ, 'స్త్రీ' 'యను నర్థ మొదవు;
'అర్థ సంకోచము'న కుదాహరణ మిదియె॥

రాగితో చేయబడు పదార్థమ్మె 'చెంబు';
అన్య లోహాల తోడ చేయంగ బడిన
విపుడు 'చెంబులె' 'యర్థ విస్తృతి' వహింప;
మోద మగు నర్థ పరిణామములు గ్రహింప॥

'నల్ల పూసలు పెరిగె కంఠమ్ము నందు'
'నిండు కొన్నవి బియ్యమ్ము తెండ'టన్న
నొప్పు నివి యుదాహృతులు 'మృదూక్తి' కనగ;
వ్యక్తి సంస్కార పటిమను బట్టి యొదవు॥

అన్య భాషా పదమ్మును నర్థ మందు
మార్పు చెందు వేరొక భాష కూర్ప బడగ;
'పట్టుదల' యను 'నాగ్రహ' పదము 'కోప'
మనెడి విపరిణామము గాంచె తెనుగు నందు॥

ఎపుడు పొసగదు సందర్భ మేక రీతి;
మాటి మాటికి మారు సూక్ష్మంపు గతుల;
కలుగు వివిధార్థ పరిణామములు పదాల;
చేకురును వేడ్క తత్పరిశీలనమున॥

అనుకరణ యోగ్యమగు శిష్ట జనుల భాష;
శిష్ట జనులు సంస్కార విశేష మతులు;
వాఙ్మయానికి తగిన దవ్వారి భాష;
అల్పముగ నుండు వర్ణ లోపాదికమ్ము॥

అనుకరణమందు నన్వేషణాదు లందు
అమిత కౌతూహ లాయత్తు డగు నరుండు;
వృద్ధ భాషణ బట్టి ప్రవృద్ధి సేయు
ఆత్మ చోదితమగు భాషణాభిలాష॥

చిలుక మైనా యనంగ పిట్టలకు కూడ
అనుకరింపంగ నొక కొంత యనువు గలదు;
అది యథా తథానుకరణ మగును; కాని
మానవుండన సృజనాత్మకానుకారి.

వాచ్య లక్ష్యార్థముల మించు వ్యంగ్య సరళి
నిత్య భాషణములలో వినిర్మలముగ
ఎవని హృది నవలీల స్ఫురింప గలదొ
అతడె పో! సరస్వతి పుత్రు డనగ నొప్పు॥

భావమును వాచ్య మొనరించు భాషకన్న
భావమును గుప్త మొనరించు భాషమిన్న
అదియె 'ధ్వని'యను పేర ప్రఖ్యాతి గాంచె;
భావరంజన భావ గోపనము నందె॥

సకల విజ్ఞాన లబ్ధి భాషా ముఖమ్ము;
దాని కంటె ననర్ఘసాధనము లేదు;
సాధనము, సాధ్యమును శబ్ద శాస్త్రమందు
శబ్ద తతి యౌట తెలియు దుష్కర మొకింత॥

భాషలో గల సౌందర్య భాండములను
గొప్పగా సుకవులు కొల్ల గొట్ట గలరు;
రంగు రుచి వాసనల తోడ రంగరింప
బడిన పదములు వాడు నేర్పరులు కవులు॥

నగర వాసులె కాదు, జానపదులేని
సృజన గావింప గలరు విశేష శైలి;
జానపద వాఙ్మయమ్ము రక్షణము సేసి
దాని భాషా ప్రశస్తి, ఛందముల గనుడి॥

ప్రజల భాషణ మందు స్వాభావికంబె
అయిన ధ్వని మేళనములు, సమాస, సంధి
తద్ధిత కృదంత వాక్య పద్ధతు లవెల్ల
శైలిగా కావ్యమందు సాక్షాత్కరించు॥

సార మతులైన కవులె ప్రాసములు, యతులు,
వివిధ కావ్యాలలోన కల్పించి రనుట
భ్రాంతి మూలము; వానిని పట్టవచ్చు
మిక్కుటముగ ననేక సామెతల యందు॥

'నారు పోసిన దైవంబు నీరు వోయు'
ననెడి సామెతలో నెట్టు లమరె ప్రాస?
'కొడుకులను గన్న యమ్మకు గోడ పంచ'
లనెడి సామెతలో యతి యతికె నెట్లు?

జాన పదుల గేయాలలో, చతుర మతులు
సముచితమ్ముగ కల్పించు సామెతలను
శబ్ద సంగతులు యతి ప్రాసలుగ మెలగు;
క్రమముగా వృద్ధి గాంచె నాగరక కవిత॥

భావ ముద్విగ్నమైనచో భాషలోని
గమనము లనేక విధముల భ్రమణ మందు
పాద పాదాక్షరమ్ముల బరగు సమత
ఇదియె ఛందో వ్యవస్థగా పదిల పడియె॥

క్రౌంచ మిథున వియోగ దుష్కర్మ జనిత
శోక తీవ్రత మౌని వాల్మీకి వాక్కు
శ్లోక మైనంత బ్రహ్మ భూలోకమునకు
ఆగమించి చెప్పించె రామాయణమ్ము॥

ఛంద ముచ్చారణములోని చందమె యగు;
తగిన ఛందమ్ము లేని పదమ్ము లేదు
వర్ణ సమ్మేళ నాదుల బట్టి తెలియు
నెట్టి ఛందము భాష ప్రవృద్ధ మగునొ!!

ఛందమును బట్టి మాఱు భాషా వ్యవస్థ;
మాషమును మషమన్న సమ్మతమె కాని
ఛందమును భంగ మొనరించు చంద మొప్ప
దనెడి కట్టడి పుట్టె నేమనగ వచ్చు!

కావ్య భాష కేర్పడియె వ్యాకర మెపుడొ
వలయు వ్యాకృతి యెట్టి భాషలకునైన
వ్యాకరణమున్న భాషఁ గావ్యము రచింప
స్పష్టపడు భాషలోని లక్షణము లెన్నొ॥

వర్ణ లోపాగ మాదేశ ప్రకృతిభావ
వ్యత్యయాది నిరూపణే వ్యాకరణము;
వాని నెఱిగిన సంస్కారవంతు డగును;
ప్రక్రియా పరిజ్ఞానమ్మె ప్రాథమికము॥

శాస్త్ర రచన సాంకేతిక స్థాయి చేత
వ్యాఖ్యలకు వ్యాఖ్య లెన్నెన్నొ యవతరించె;
వ్యాఖ్యచే విశేష ప్రతిపత్తి గల్గు
వల దలక్షణ సందేహ భావ మనరె?

ఆధునికులందు సాంకేతి కాభిమాన
మతిశయించుటలోని రహస్య మేమొ!
శాస్త్రమును బీజ గణితమ్ము స్థాయి జేర్ప
విశ్వజన భావనమునకు విహిత మనియ?

ఎట్లొ పశు పక్ష్య వితతి జీవింప నేర్చు;
నవ్య జీవిత యోగి మానవుడు ధాత్రి;
వివిధ భాషలు కళలు నావిర్భవించు
సత్య శివ సుందరముల సంస్థాన మతడు॥

పద్యమే రక్తిగను కొన్ని భాష లందు
గద్య రచనోపయుక్తముల్ గలవు పెక్కు;
గద్య పద్య గేయాత్మక హృద్య రచన
లపరిమితముగ సాగెడి వల్ప సంఖ్య॥

అన్ని భాషలు మున్ను హలంత మైన
అందు కొన్ని క్రమాన నజంత మాయె;
రమ్యమౌ పెక్కు నాద ధర్మములు గల్గి
నవియె సంగీత కళకు యోగ్యమ్ము లగును॥

క చ ట త ప మారు ద్రుతముపైగ జ డ ద బ గ
కళలపై మారు కొన్నింట గ స డ ద వ గ;
ఇత్వ ముత్వము; ఉత్వమ్ము నిత్వమగును;
శ్రవణ హితమగు నాద ధర్మమ్ము లరయ॥

మనుటతో తృప్తి చెందడు మానవుండు
సుందరోజ్వల జీవితానందయోగి
నిత్య వైవిధ్య నూతనా న్వేషి యగుట
తనదు భాషను తీర్చి దిద్దంగ జూచు॥

భాషలో శక్తిలేదను వాదు తగదు;
ప్రజ్ఞ రచయిత కున్న నేభాషకైన
దివ్య భావ పరీమళ దీప్తి గల్గు
భాష రచయిత వలన ప్రాభవముగాంచు॥

ప్రజలు విశ్వకుటుంబ సంభావ మతులు;
వాఙ్మయము ప్రాంత సమయ నిబద్ధ భాష
గాక, యనిబద్ధమై స్వేచ్ఛగా సృజింప
బడిన, ననువాదమున జగ ద్వ్యాప్తి గాంచు॥

సామెతలు, నుడికారముల్ చక్క కూర్ప
బడిన యుప్పు డది నిబద్ధ భాష యగును;
అట్టి దనువాద కష్ట సాధ్యంబు గాన
వాంఛితం బౌను నే డనిబద్ధ భాష॥

ప్రాయ సులువు నిబద్ధమౌ భాష లోన
కష్ట మనిబద్ధ భాషలో కావ్య రచన;
రాని దాని నెట్లైన నేర్వంగ వచ్చు;
నేర్చినది విస్మరించు మనీషి గలడె?

కవి రవీంద్రుడు తావిశ్వకవి యటన్న
ఖ్యాతి గాంచె గీతాంజలి కావ్య రచన;
అదియు ననిబద్ధ భాషలో పదిల వడుట
ఉర్వి భాషల కనువాద యోగ్య మాయె॥

ఎగురునే పక్షులన్నియు నేక గతిని?
ఒప్పునే కావ్య సంతతి కొక్క తీరు?
భాష కొన్నిట మిన్న భావమ్ము కన్న
భావమే మిన్న కొన్నిట భాష కన్న॥

భావమున కూడిగము సేయవలయు భాష
తగదు భాష కాడంబరత్వము రవంత;
ప్రతిభ గల కవీశ్వరుడు భావము నొకింత
సడల నీడు; భాషను కైవశము నొనర్చు॥

భావ నిర్మలినత్వమే భాష కొదవు
భావము గభీరమైనచో భాషయు నగు
భావగతమగు మెలికలు భాష నుండు
భావనాధార వర్తియే భాష యనగ॥

భావగతులను గప్పుచు భాషపరగు
తన్నిరూపణ మగును ఛందస్సు నంగ;
భావమును భాష ఛందమ్ము పరిగణింప
గంగ యమున సరస్వతి సంగమమ్ము॥

పదము లెన్నికసేయంగ ప్రతిభ జూపు
కవులు భాషల నల్ప సంఖ్యాకు లెపుడు;
ఎన్నికైన పదాల నెంతే మథించి
శిల్పము ఘటించువార లత్యల్ప సంఖ్య॥

సముచిత పదమ్ము తగిన తానమున నుంచి
పఠిత నుత్తేజ మొనరించు ఫణితి శైలి;
వ్యస్త మెచ్చోట? నెచట సమస్త మొప్పు?
నామమా? క్రియా? యెద్ది? నిర్ణయమె శైలి॥

మంత్ర ముగ్ధమౌ శైలి సంపాదనమున
కాంతిమంతమ్ములగు గదా! కావ్యవితతి!
అట్టివి పఠించి పారవశ్యమును గాంచి
సంతతానంద జీవనోత్సాహి వగుము॥

శైలి శాస్త్రము నేడు ప్రశస్తి గాంచు
దేశ దేశాంతరముల నుద్దీప్తితోడ;
కావ్య భాషా స్వరూపావగాహనమున
సహృదయున కిది మార్గ దర్శకము నగును॥

భాష, వాఙ్మయ మ్మ్యాన భావములు వలదు,
సాధనమె భాష యను నిరసనము తగదు;
అత్యుదాత్త గంభీర సాధ్యము తలంప
అతి వినిర్మల సాధనాయత్త మెపుడు॥

వీరశైవము, వైష్ణవావేశమట్లు
వలదు భాషను గూర్చి వివాద మెపుడు;
గ్రాంధికమె గాని; వ్యవహారికమ్ము గాని
వ్రాసి మెప్పించవచ్చు, నుపజ్ఞ యున్న॥

జగతి కొక భాష యనెడి శాసనము తగదు;
జను లనేక భాషల నేర్వ్యజాల రైన
పెక్కు భాషలెఱుంగు కోవిదులు గలరు
ప్రాభవోన్నత మతు లనువాద విద్య॥

స్వర్గ గోపుర నిర్మాణ సమయమందు
మానవుల శపించెను భగవాను డెపుడొ!
అయిన ననువాద కోవిదులైన నరులు
ధరణి నేకం బొనర్చు యత్నములు విడరు॥

సృజన గావించు ప్రతిభ క్షీణించె నిపుడు,
వివిధ పరిశోధనమ్ములు విస్తరిల్లె
విషయమయమైన బుద్ధి నవీన మాయె;
అంతర మణంగె; ప్రబలె బాహ్యమ్ము మిగుల॥

సంకరము కాని దనదగు జాతిలేదు;
స్వచ్ఛతావాదమే శాస్త్ర సరళి కాదు;
జాతులను బట్టి తగదు భాషా నిరూఢి
భాష జాతుల పట్ల గర్వమ్ము తగదు॥

భాష యొకటైన, ఐక్యభావంబు లేక
జాతి మనుగడ హాయిగా సాగిపోదు;
ఏక భావంబు గల్గి యనేక భాష
లాడ వచ్చును; దాన ప్రఖ్యాతి గల్గు॥

సహజ భాషాభిమాన సంసక్తమతిని
అన్య భాష లనేకమ్ము లభ్యసింతు
రన్య దేశీయు; లేలకో యార్యభూమి
భాషలను గూర్చి యేర్పడె ద్వేషబుద్ధి॥

ఆంగ్ల పాలన మెంత యన్యాయమైన
ఆంగ్ల భాషను గర్హింప న్యాయ మగునె?
అదియె యిప్పట్లు భావ సమైక్య కారి;
సకల విజ్ఞాన మాంగ్ల భాషాముఖమ్ము॥

ఆర్ష వాఙ్మయ మంత నాపోశనింప
కలిగె నౌన్నత్య గరిమ యాంగ్లమున కెంతొ!
అల రవీంద్రారవిందు లీయాంగ్ల మందె
విందొనర్చిరి సత్కావ్య వితత గూర్చి॥

భాష, జాతి సమైక్య జీవన విధాన
భంగకారి కాగూడ దెప్పటికి నైన;
భాష లెన్నిటి నైన నేర్వంగ వచ్చు
విశ్వ పౌరుని రీవి జీవింప నోపు॥

ఏక భాషా ప్రపంచమ్ము లేకయున్న
కాక తప్ప దెప్పటికైన నేక జగతి;
వసుధ పాలింపబడు ప్రభుత్వము చెలంగు
తొలగు భాషావరోధముల్; కలుగు ప్రగతి॥

ఏక భాష, జగత్తుకు లేక యున్న
ఎన్నదగు నన్ని భాషల కేక లిపిని;
విపులముగ వ్యాప్తిగాంచిన లిపినె యితర
భాష లాడెడివారు నేర్వంగ వచ్చు॥

ప్రతిభ గల వ్యక్తి తన మాతృ భాష యందు
వ్యక్త మొనరించు భావ సంపద ప్రపంచ
మందు వ్యాప్తమె విశ్వసమైక్య సిద్ధి
గనుట; నానాత్వమందు నేకత్వ మనగ॥

ధరణి గంటలలోనె ప్రదక్షిణించు,
క్రొత్త భాష దినాలలో హత్తుకొనును;
సుకర పద్ధతు లెన్నొ సంశోధితములు;
శాస్త్ర శేముషి కెద్ది యసాధ్యమనగ?

సతత భాషానుశీలనాసక్త బుద్ధి
పద్యముల జెప్పెని 'బొడ్డుపల్లి' యొజ్జ;
ఎంత వరకివి మిమ్ము సంతృప్తి పరచు
బుధులు! తెల్పుడీ 'పురుషోత్తము'నకు నిజము॥

వాక్కు ననుశీలనము సేయ బ్రహ్మకైన
తరము కాదను మాట వాస్తవమెయయిన
ప్రాక్కృతీచీ మనీష దృక్పథ మొకింత
తెలియ జేసితి బాల్య చాపలము కొలది॥



చేర్పులు :

పుట 3 : చివర :

మాన్యమతులైన కవుల వాఙ్మయము సొగసు
జనుల వాడుకలోని భాషా విశేష
మహరహమ్ము నేకాగ్రత నరయు విబుధ
మండనుడె నాదు దృష్టి వాఙ్మయ తపస్వి॥

పుట 15 : రెండో పద్యం తరువాత :

ధీరురాలగు, కాదామె ధీరునాలు
చిగురు టాకులు మేయునే సింహరాజ
మనెడి నుడులందలి రు,ను,టు గాగమములు
అర్థ శూన్య పదాంశము లనగనొప్పు॥

,, 34 : మొదటి పద్యం తరువాత :

తండ్రి కోశమైన తల్లి వ్యాకరణము
తల్లి తండ్రి యున్న తనయు రీతి
పదము రెంటి చేత ప్రతిపాదితమ్మైన
స్పష్టగతిని జగతి వ్యాప్తి గాంచు॥

# వి వృ తి

వాగనుశీలనంలోని పద్యాలు విన్న పెద్దలు కొందరు వ్యాఖ్యా నాన్ని అపేక్షించారు. ఆపనిని నన్ను నిర్వహించమన్నారు. అందుకు తెనుగు వ్యాకరణ వికాసం (తె. వ్యా. వి.) భాషాశాస్త్ర పరిచయం (భా. ప.) తిరిగి తిరిగి చూచే అవకాశం లభించింది. కొన్ని యభి ప్రాయాలకు మూలాల్ని రచయిత నడిగి తెలుసుకొన్నాను. నేనెంత వరకు న్యాయం చేకూర్చగలిగానో నాకు తెలియదు. ఆత్మసంస్కా రానికీ ప్రయత్నం నాకుపకరించిందని సంతోషపడుతున్నాను

భాషా సాహిత్య విద్యార్థుల కీవివృతి ఏమాత్రంగానైనా ఉప యోగపడితే నా ప్రయత్నం సఫలమైందని ఆనందిస్తాను. ఈ ప్రేరణ వల్ల అనేక గ్రంథాలు చూచే సదవకాశం లభించిందని సంతోషిస్తు న్నాను.

—కె. గిరిజాలక్ష్మి

పుట_1 పద్యం 1 :

సకల భాషాసరస్వతికి నమస్కారం

వాసనామాత్రంగా సూక్ష్మరూపంలో ఈమె మానవులందరి హృదయాలలో ఉండి మాటాడింపజేస్తుంది. వైయక్తిక భాషణం (idiolect) ద్వారా ఆయా భాషావ్యవస్థలకనుకూలంగా వైవిధ్య విలసితంగా ఆమె ప్రవర్తిల్లుతుంది.

*Idiolect* : Variety of speech used by one given individual in its relation to the accepted language system (Language in the Modern world by Simeon Potter, p. 207).

1-2 : "మహాత్ముల వాక్కులు ప్రసన్న గంభీరములై పునఃపునరనుసంధానము సేయుకొలది యపూర్వ రమణీయార్థ ప్రతిపాదకములై భాసించును. మహాకవి భారవియు నెంతయో సుకృతాత్ములకు గాని యట్టి ప్రసన్న గంభీరవాక్కు ప్రసరింపదనినాడు :

"వివిక్త వర్ణాభరణా సుఖశ్రుతిః
ప్రసాదయన్తీ హృదయాన్యపి ద్విషామ్।
ప్రవర్తతే నాకృత పుణ్యకర్మణాం
ప్రసన్న గంభీర పదా సరస్వతీ॥"

—భారతీవిరుక్తి, పుట 480

శ్రవణము జేసి, శ్రుత్యర్థమును జక్కగా మననము జేయు విద్వాంసుని మనస్సు వివిధ విజ్ఞానములకు నిలయమై 'సరస్వాన్' అగుచున్నది. తద్గతమగు వాక్కు (వేదవాణి) 'సరస్వతి' యగును.

"మనోహి సరస్వాన్। వాక్ సరస్వతీ।

(శతపథశ్రుతి 7-5-1-35)

"మనసస్తావత్ సర్వశాస్త్రార్థ పరిజ్ఞాన రస
ధారత్వాత్, వాచశ్చ తత్ప్రతిపాదన
రసాధారత్వా
దుత్సత్వమనయోః"

—సాహిణిభాష్యం

మనస్సు 'సరస్వాన్' అనియు, వాక్కు 'సరస్వతి' అనియు, నీరెండును సారస్వత ప్రవాహములనియు నిట జెప్పబడినది.

వాఙ్మనస్సులు జలప్రవాహముల వంటివి. లేక ఊటబావులవంటివి. ఊటబావులలో తోడినకొలది నీరు పైకి ఉబుకుచుండు రీతి విజ్ఞాన విషయముల మననము చేయుకొలది, మనస్సున నూత్ననూత్నం

శము స్ఫురించుచుండును. వాక్కు కూడ చిత్త సంస్కృతిక్రమము ననుసరించి నూత్ననూత్నార్థములతో శోభిల్లును...."

—భారతీనిరుక్తి, పుట 549

1-3 : అసతోమా సద్గమయ
తమసోమా జ్యోతిర్గమయ
మృత్యోర్మా అమృతంగమయ

ఈ ఉపనిషదుక్తం సాధన శబ్దబ్రహ్మోపాసనవల్ల కలుగుతుందని నమ్మకం.

2-1 : త్వమేవ మాతాచ పితాత్వమేవ
త్వమేవ బంధుశ్చ సఖాత్వమేవ
త్వమేవ విద్యాద్రవిణం త్వమేవ
త్వమేవ సర్వం మమ దేవ దేవ;

అనే ప్రార్థన శ్లోకం శబ్దపరంగా పేర్కొనబడింది. మానవునకు వైజానిక జన్మనిచ్చి పెంచి పెద్దచేసి, విద్యాబుద్ధులిచ్చి, కలిమిని చేకూర్చే శబ్దమే మానవసర్వస్వంగా భావితం.

2-2 : యద్వేదాత్ ప్రభుసమ్మితా
దధిగతం శబ్దప్రధానాచ్చిరం

యచ్ఛార్థ ప్రవణాత్ పురాణవచనా
దిష్టం సుహృత్సమ్మితాత్
కాంతా సమ్మితయా యయా
సరసతా మాపాద్య కావ్యశ్రియా
కర్తవ్యే కుంతికీ బుధోఽపి రచితః
తస్యైస్పృహాం కుర్మహే॥

అనే విద్యానాధుని ప్రతాపరుద్రీయ శ్లోకమాధరంగా ప్రభు సమ్మిత, మిత్రసమ్మిత కాంతాసమ్మితోపదేశాలు మూడు శబ్దంమూలంగానే నిర్వహింపబడుతాయి. కాబట్టి మానవుడ్ని కర్తవ్యోన్ముఖుడ్ని చేసే శబ్దాన్ని ప్రతివ్యక్తి శ్రద్ధగా ఉపాసించాలని ప్రబోధితం.

2-3 : అవ్యాహృతం వ్యాహృతాచ్ఛ్రేయ ఆహుః
సత్యం వదే ద్వ్యాహృతం తద్వితీయం
ప్రియం వదే ద్వ్యాహృతం తత్తృతీయం
ధర్మ్యం వదే ద్వ్యాహృతం తచ్చతుర్థమ్
(భారతం_ఉద్యోగ_36_12

మాట్లాడటం కంటె మౌనం వహించటం ఉత్తమం.
మాట్లాడవలసివస్తే సత్యం మాట్లాడటం రెండోపద్ధతి.

ఇష్టంగా మాట్లాడటం మూడో పద్ధతి.
ధర్మవాక్యాలు చెప్పటం నాల్గో పద్ధతి.

"ప్రియము పలికెడు వారిన పెద్దమెత్తు
రప్రియంబును బథ్యంబునైన పలుకు
వినగ నొల్లరు గావున వేడ్కా దానిఁ
బలుక రెవ్వరు నుత్తమ ప్రతిభులయ్య".
"మొదల నప్రియ మయ్యును దుదిఁగరంబు
పథ్యమగు పల్కు ప్రియులందు బలిమినైనఁ
బలుకవలయు మోమోడక యొలసియట్టి
వాఁడు దగు సహాయుండు భూవల్లభునకు"

(సభా. 2ఆ. 191, 192)

అని నన్నయగారి విదురుడు దుర్యోధనునికి హితబోధ చేసాడు. ఇట్టివెన్నో ఉన్నాయి.

2-4 : సులభాః పురుషారాజన్। సతతం ప్రియవాదినః
అప్రియస్య చ పథ్యస్య వక్తా శ్రోతాచ దుర్లభః

(వాల్మీకి III_37_2)

నహీదృశం సంవననం లోకేషు విద్యతే
దయామైత్రీచ భూతేషు దానంచ మధురాచ్ వాక్॥
(భారతం, ఆది 81_20)

సర్వ భూతదయావన్తః హ్యహింసా నిరతాస్సదా
పరుషంచ న భాషన్తే సదాసన్తో ద్విజప్రియాః
(భారతం_అర_24-26)

అసత్ప్రలాపం పారుష్యం పైశున్యమనృతం తథా
చత్వారి వాచా రాజేంద్ర నజల్పే నానుచిన్తయేత్॥
(భారతం ఉద్యోగ-35-5)

"సత్యం బ్రూయాత్ ప్రియం బ్రూయాత్
న బ్రూయాత్ సత్య మప్రియమ్
ప్రియంచ నానృతం బ్రూయాత్
ఏష ధర్మః సనాతనః"

—(మనుస్మృతి)

సత్యం యత్ పరదుఃఖాయ
తత్రమౌన పరోభవేత్"

అనీ హెచ్చరిక. "ప్రియ హిత సత్యవాక్య!" అనే వన్నయ గారి రుచిరార్థ సంబోధన సంస్మరణీయం.

3-1 : తేజస్సు— బాహ్యకాంతి : ఓజస్సు, అంతరకాంతి : వాఙ్నియమం ఈ రెండింటిని చేకూరుస్తుంది.

3-2 : Means and ends. కొందరు రెండోదానికే ప్రాధాన్యం ఇస్తారు గాంధి మొదలైనవారు మొదటిదానికే ప్రాధాన్యం. మన సంప్రదాయాలలో గూడ 'సాధన'కే అధిక ప్రాధాన్యం కొందరు సాహిత్యవేత్తలు వ్యాకరణాన్ని నిరసించటం సహించలేక ఇలా వ్రాసివుంటారు.

3-3 : ఓం వాఙ్మే మనసి ప్రతిష్ఠితా
మనో మే వాచి ప్రతిష్ఠితమ్
అవిరా వీర్మ ఏధి
వేదస్యమ ఆణీస్థః

....(ఋగ్వేద శాన్తి పాఠః)

3-4 : అనుద్వేగకరం వాక్యం
సత్యం ప్రియహితం చ యత్
స్వాధ్యాయాభ్యసనం చైవ
వాఙ్మయం తప ఉచ్యతే

—శ్రీమద్భగవద్గీతా XVII—15

4-1 : **Language is loud thinking**

మనోబుద్ధ్యాదులందలి మధ్యమా పశ్యంతి పరావాక్కులు నిత్యము. స్థానకరణ సంయోగాదులచే ఉత్పన్నమై శ్రోతకు గాహ్య మయ్యే శబ్దం నిత్యం. ఇదే వైఖరీవాక్కు. వివరాలకు చూ. తెనుగు వ్యాకరణ వికాసం. (తె.వ్యా.వి.) పుటలు 1020–1022

వర్ణాతిరిక్తః వర్ణాభివ్యంగ్యః అర్థ ప్రత్యాయకో నిత్యశ్శబ్దస్ఫోటః

4_2 : స్ఫుట త్యర్థోఽస్మాదితి స్ఫోటః–స్ఫోట యత్యర్థమ్

4-3 : A language may be defined as a system of arbitrary vocal sounds by means of which human beings communicate and co-operate with one another—Modern Linguistics, p 36

Simeon Potter

పై నిర్వచనంలో 'ప్రాంత వాసుల'ని లేదు. భాషకు ప్రాంతీయతా భేదం ముఖ్యం. ఇందులో భాష ప్రాథమిక ప్రయోజనా ప్రధానం, తక్కినవి లేకపోయినా మనుగడ సాగుతుంది.

4_4 : Gesture language: కంఠధ్వనులు భాషగా రూపొందని స్థితిలో ప్రాథమిక మానవు డెక్కువగా ఉపయోగించే వాడు. ఇప్పటికి మూగవాళ్లకిదే గతి. నాగరక మానవుకు యంత్రం

2)

లాగా చేతులు కట్టుకొని మాట్లాడడు. హావభావాలు కావిస్తూ తన భాషణానికి రక్తి చేకూరుస్తాడు.

5_పుట భాష పుట్టుకను గూర్చిన సిద్ధాంతాలివి (1) దైవదత్తమని ప్రాచీనుల నమ్మకం. అయితే అప్పుడు మానవులకు ఒకే భాష ఉండాలి. (2) సంపాదిత సిద్ధాంతం (The Theory of acquisition) సైకిల్ తొక్కటం, వీణ వాయించటం లాగా భాష కూడా నేర్చుకొనేదయితే అందరికి ఇది సమానంగా లభ్యం కాగూడదు కదా! ఎంత తెనుగు పండితుడైనా 'అమ్మా! అన్నం పెట్టు' అనే అంటాడు. కావ్యభాషా పరిజ్ఞానం కాదు, ప్రాథమిక భాష అందరికి సమానంగా లభ్యం కాబట్టి ఇదీకాదు. (3) క్రమ వికాస సిద్ధాంతం. (Continuous theory) కోతుల నుండి సంక్రమించిందనే వాదం. వానరం నుండి నరుడేర్పడ్డా భాష మాత్రం అలా వారసత్వం కాదు. (4) సహజ సిద్ధాంతం: (innate theory) పుట్టుకతోనే భాషించే శక్తి మానవుడి కున్నది. బాహ్యదోహదంవల్ల అది వృద్ధి చెందుతుంది. ఇది ఛామ్‌స్కీ సిద్ధాంతం.

ఇంకా వివరాలకు చూ. భాషాశాస్త్ర పరిచయం_(భా.ప.)
డాక్టర్ పురుషోత్తం. పుటలు 9_13

6_1 : భాష పుట్టుకను గూర్చి ఇంకా కొన్ని వాదాలు: బౌవౌ వాదం, డింగ్ డాంగ్ వాదం, ఆశ్చర్య వాదం మొదలైనవి. ఇవన్నీ అశాస్త్రీయాలు. కాని భారతీయుడైన యాస్కాచార్య ప్రోక్త ధాతువాదం (root theory) సమంజసంగా పరిగణితం. భాషలన్నీ ఒకప్పుడు ధాతువులతోనే ఉండేవని, క్రమంగా పదాలేర్పడ్డాయి అంటారు. ఇప్పటికి ఈ ప్రాచీన లక్షణం చైనా, బర్మాభాషల్లో చూడవచ్చు. చూ. విశ్లేషాత్మక భాషా లక్షణాలు_

(Isolating Language Features) పుటలు 49, 50 (భా. ప.)

6_2 : యథా ద్రవ్య విశేషాణాం పరిపాకై రయత్నజాః
మదాది శక్తయో దృష్టాః ప్రతిభా స్తద్వతాం తథా.

వాక్య పదీయము_I_148 (తెలుగు అకాడమీ ప్రచురణ) ప్రతి ప్రాణిలో సహజంగా వుండే శక్తే ప్రతిభ. కోకిలలు కూయటానికి మనిషి మాట్లాడటానికి ఇదే కారణం చూ. I_149, 150

6-3 : ప్రతిభ : సామాన్యం : మాట్లాడటం,
విశేషం : సృజనాత్మకం

6_4 : ప్రాచీనమైన ఆంగిక భాష నుండి అభినయ కళ రూపొందింది. అభినయాన్నే 'నేత్రభాష' అంటారు.

7_1 : వివక్ష : భాషించేవాని ఇచ్ఛ. ఎప్పుడు కర్త్రర్థం, ఎపుడు కర్మార్థం, ఎప్పుడే కారకం వాడాలో వ్యవహర్త ఎన్నిక మీద ఆధారపడి వుంటుంది. అందుకే వ్యాకర్తలు_వక్తుర్వివక్షా, అంటుంటారు 'వివక్షాతః కారకాణి' అని పరిభాష.

(A Dictionary of Sanskrit grammar)

అందుచేత ఎవడో ఒక భాషా వ్యవహర్త (informant) ను బట్టి వాడిచేత చెప్పించి వ్రాసుకొన్న వ్రాతలు భాషను సమగ్రంగా నిరూపించవు.

7_2 : కీ.శే. చిలకమర్తి లక్ష్మీనరసింహంగారు ఆ విధంగా గుర్తు పట్టగల్గే వారంటారు సోదరుడు డాక్టర్ మన్నవ సత్యనారాయణ (ఆంధ్ర పరిశోధకుడు) చాలావరకు ఇలానే గుర్తు పడుతుంటాడు.

'ముఖే ముఖే సరస్వతి'_మాట్లాడే తీరు వేరుగా ఉండటాన్నిబట్టి ఏర్పడ్డ ఆర్యోక్తి.

7-3 : ఇద మంథం తమః కృత్స్నం
జాయేత భువన త్రయమ్
యది శబ్దాహ్వాయం జ్యోతి
రా సంసారం నదీప్యతే॥

దండి కావ్యాదర్శః.

సూర్య చంద్రుల కన్నా శబ్ద జ్యోతి మిన్నగా ఇక్కడ ప్రశం సింపబడింది.

7_4 : మానవుడీరీతిగా ప్రాథమిక ప్రయోజనం తోపాటు ఉదాత్త ప్రయోజనాన్ని (Sublimation) సాధించటానికి 'నాల్క' నుపయోగించు కొంటున్నాడు. 'Tongue' అంటే భాష అనే వ్యవహారం ఆంగ్లంలో ఉంది.

8_2 : మాతను, మాతృ భాషను అవజ్ఞ చేయటం మానవునకు పరిపాటి. 'అతి పరిచయాత్ అవజ్ఞా, సంతత గమనాత్ అనాదరోభవతి, మలయేభిల్ల పురంధ్రిణః చందన తరుకాః మందనీకరోతి,' అనేచాటువు ప్రసిద్ధి.

8_3 : ఇప్పటికి ఈ పద్ధతి కొనసాగుతునే వుంది. ఆటవిక భాషలకు వ్యాకరణాలు, కోశాలు చాలమంది శ్రమపడి వ్రాయటానికి కారణం, స్వమత ప్రచారం కోసమే.

8_4 : కన్నతల్లి మాతృభాష–తక్కిన భాషలు పినతల్లులు. మాతృ భాషా పదాలు వదలి అన్యభాషాపద ప్రయోగం కావించటం ఇటువంటిదే అంటారు.

9-1 : Language makes an infinite use of finite means —భా.ప. పుట 3

"వర్ణైః కతిపయైరేవ, గ్రథితస్య స్వరైరివ
అనంతా వాఙ్మయస్యాహో! గేయస్యేవ విచిత్రితా"
—శిశుపాలవధ (భా.ప. పుట 4)

భాషించటం నాగరక మానవునికే కాదు, జానపదుడికి తెలుసు ఒక గ్రామస్థునితో చీకటిలో నడుస్తుంటే అతను "ఈ కఱ్ఱ నాకు మూడోకన్ను లాగా పనిచేస్తున్నద"ని అన్నాడని, అందుకు తాను ముగ్ధుడ్ని అయినానని రచయిత తన అనుభవాన్ని చెప్తుంటే గ్రహించాను.

10_2 కేయూరాణి విభూషయన్తి పురుషం
హారాన చన్ద్రోజ్జ్వలా
న స్నానం న విలేపనం నకుసుమం
నా లఙ్కృతా మూర్ధజాః

నా ణ్యేకా సమలఙ్కరోతి పురుషం
యా సంస్కృతా ధార్యతే
క్షీయ న్తేఽఖిల భూషణాని సతతం
వాగ్భూషణం భూషణమ్"

అని భర్తృహరి భగవానుని సుభాషితం. (నీతి- 6) దీన్నే భంగ్యంతరంగా వాగ్భూషణం ఉంటే తక్కిన భూషణాలు (నశించేవే అయినా) రాణిస్తాయి. అది లేకపోతే ఇవేవి రాణించవు అనటమో చమత్కారం.

10-4 : పశు పక్ష్యాదులు ఆహార మవసరమైనప్పుడు అరుస్తాయి. ఆహారం బాగా తిన్నా అరుస్తాయి. ఇదంతా ప్రాణధారణకే. (biological) ఇది వాటి సహజ ప్రవృత్తి (instinctive) కాని భాష అట్లాంటిది కాదు. అందుకే "Language is a purley human and non-instinctive method of communicating ideas, emotions, and desires by means of a system of voluntarily produced symbols" అంటారు. (Language, p. 8) (Sapire)

11-2 : కృతక భాషలు, ఎవరికి మాతృభాష కానివి. వీటినే అంతర్జాతీయ భాషలంటారు. (International languages) ఓలపక్, ఎస్పరాన్తో మొదలైనవి చూ. లక్షణాలు: భా.ప. పుటలు 308-12.

11-3 : భాష అంటే ఏవో వర్ణాలు, పదాలు కాదు. మాటాడేటప్పటి దాని సజీవ లక్షణాలు (emotive element) చాలా ముఖ్యం. కాకువు : దేవుని ఎదుట నిల్చి నిజం చెప్తాను?

చూ. భా. ప పుట 100

ఊనిక—(Stress) permit—verb—permit—Noun—చూ. భా. ప. పుట 105

11-4 : "A Language is the way people talk, not the way some one thinks they ought to talk."

(భా. ప. పుట—3)

12-3 : శిష్టులు—Cultured and learned people who want to speak Correctly and who there-fore have studied grammar Cf. కే పునః శిష్టాః। వైయాకరణాః। కుత ఏతత్। శాస్త్ర పూర్వికా హి శిష్టిర్వైయాకరణాశ్చ శాస్త్రజ్ఞాః। (Dictionary. Of Sanskrit grammar) ఇంత అర్థం ఇప్పుడన్వయించక పోయినా, చదువు కొన్నవారు, సంస్కారాభిలాషులని చెప్పవచ్చు. 'శిష్టవ్యవహారికం' పోయి కేవలం 'వ్యావహారికమ'నే ప్రయోగమే ప్రాచుర్యం వహించింది.

12-4 The Hindu Grammar taught Europeans to analyse speech forms....Bloomfield, Language p. 12

13-1 This Grammar, which dates from somewhere round 350 to 250 B.C. is one of the greatest monuments of human intelligence: Bloomfield-Language' p. 11.

13-2 The modern linguist is putting himself back into the position of Panini who gave a complete account of Sanskrit ...

Language in the Modern world-Simcon Potter, p. 11.

13-3 ....It was more scientific than anything produced by the greeks, who had already shown considerable interest in the relation of language to Logic and philosophy

(Ibid—p. 144)

13-4 "The man who is in charge of grammar and is called grammarian is regarded by all plain men as frigid and dehumanized pedant"—The grammarian and his language by Edward Sapir: తె. వాఙ్. వి. పుట 1031: F.N. 2

3)

"పథమోహి విద్వాంసో వైయాకరణాః"—అని ఆనంద. వర్ధనుడు వ్యాకర్తల్ని గౌరవించారు. అర్థ నిర్ణయంలో వారికి గల బుద్ధి సూక్ష్మత వల్ల ఈ గౌరవం కలిగింది.

14-1: "వాక్యము వలననే లోకులకు అర్థబోధ కల్గుచున్నది. కనుక వాక్యమే సత్యమైనది యని వైయాకరణులు విశ్వసింతురు. శబ్దమునకు సాధుత్వము జూపునది వ్యాకరణము. వాక్యము లనంతములు కనుక వానికి సాధుత్వ ప్రదర్శనము శక్యము కాదని భావించి వానిలో నుండి పదములను విభజించిరి...." వాక్యపదీయము (తె. అ.) పుట 17; అప+ఉద్+ధార= విభజించుట.

14-2: అన్వితాభిధాన వాదము : వాక్యము నందలి పదములు ఒండొంటితో నన్వయించి వాక్య తాత్పర్యమును దెలిపిన తర్వాత తమ తమ ప్రత్యేకార్థములను దెలుపును—ప్రాభాకరుల వాదము.

అభిహితాన్వయ వాదము : వాక్యము నందలి పదములు తమ తమ ప్రత్యేకార్థములను తెలిపిన పిమ్మట పరస్పర మన్వయించి వాక్యార్థమును దెలుపును—అను భాట్టుల వాదము. (సూ. ని.)

తొలివాదానికి చెందిన వారిని వాక్యవాదులని; మలి వాదానికి చెందిన వారిని పదవాదులని అనవచ్చు.

14_4: అర్థవంతమైన శబ్దం_పదాంశం. (morpheme) అవిబద్ధ లేక స్వతంత్ర పదాంశాలు (Free morphemes) విబద్ధ లేక అస్వతంత్ర పదాంశాలు. (bound morphemes)

పుస్తకము (F.M.)+లు (B M.)=పుస్తకములు (F.M.)
పుస్తకములతో (b.m.)

15_2: శూన్య సపదాంశం (Zero allomorph) sheep-sheep, deer_deer బహువచనంలో శూన్యసపదాంశం చేరిందనాలి.

'The sheep grazes, The sheep graze. Here the Hindus hit upon the apparently artificial but in practice eminently serviceable device of a speaking of a zero element, in sheep-sheep, the plural suffix is replaced by a zero, that is h nothing at all-Bloomfield, P. 209,

భా. వ. పుట 128

తెలుగులో ప్రథమైక వచన లోపం_హరి, గిరి ఇత్యాదులు: స్త్రీ సమరూపాలు_అన్న, అక్క, కుక్క ఇత్యాదులు, శూన్య

సపదాంశాలు చేరిన రూపాలు. వీటికి రూపం లేదుగాని అర్థమున్నది (పుట 58 : చేర్పు)

ధీరురాలు, చిగురుటాకు, ధీరునాలు_ఇత్యాదుల్లో ర్, ట్, న్ అనే ఆగమాలకు అర్థం లేదు. కాని రూపాలున్నాయి. వీటిని అర్థశూన్య పదాంశాలు (empty morphemes) అంటారు. (చూ. భా.వ. పుట 128)

15–3: చ్ [చ్, చ్] సవర్ణాలు (allophones)

మ్ [మ్, వ్ఁ] ,, ఇవి పరస్పరాభావ ప్రవర్తకాలు (complementary Distribution)

[రుళ్లు, ంڈ్రు, ం] బహువచన సపదాంశాలు (allomorphes)

15–4: సంస్కృతంలో ప్రకృతి, ప్రత్యయాలు రెండు నిబద్ధ పదాంశాలే (Bound morphemes) పద మొక్కటే ప్రయోగార్హం. 'న కేవలా ప్రకృతిః ప్రయోక్తవ్యమ్, నాపి ప్రత్యయః' అని హెచ్చరిక. పుస్తకః (ప్రకృతి)+ము

(ప్రత్యయం)=పుస్తకము (పదం) పుస్తక+ము (ఆగమం) +లు (ప్రత్యయం)=పుస్తకాలు.

16_1: ప్రకృతికే అన్నిఅర్థాలు (స్వార్థ, లింగం, ద్రవ్య. సంఖ్య, కారకాలు) ప్రత్యయం వాటిని ప్రతీయమానం చేసేదిగా ప్రాచీన సంస్కృత వైయాకరణుల అభిప్రాయం. దీనిని నవీన సంస్కృత వైయాకరణులు అంగీకరించరు. ప్రత్యయానికి సంఖ్య కారకార్థాలు కొన్నైనా చెప్పాలంటారు. (Dictionary of Skt. grammar-ప్రాతిపదికార్థ.

భాషా శాస్త్రజ్ఞులు రెండింటిని పదాంశమని (morpheme) వ్యవహరించి సమాన ప్రతిపత్తి నిచ్చారు.

16_2: సంయోగాత్మక భాషలు : (agglutinative languages) ప్రత్యయాత్మక భాషలు (inflexional") శ్లేషాత్మక భాషలు (isolating")

16_3: ప్రకృతి ప్రత్యయ సమ్మేళన మున్నప్పుడే వ్యాకరణప్రమేయం అట్టిది లేకపోతే వ్యాకరణంతో పనిలేదు. ప్రత్యయాత్మకమైన సంస్కృతాదుల కెంతో వ్యాకరణ వాఙ్మయం. తెలుగు మొదలైన సంయోగాత్మక భాషలకి పరిమిత వ్యాకరణం; చైనా

భాషకు వ్యాకరణమే లేదు. ప్రత్యయాల కలయిక లేదు కాబట్టి.

17_2: అమెరికా ఖండంలో కొన్నివేల రెడ్ ఇండియన్ భాషలున్నాయి. ఏదో ఒక భాషను తీసుకొని దాని వ్యవస్థను వర్ణిస్తే అతణ్ని భాషా శాస్త్రజ్ఞుడుగా గౌరవిస్తారు.

18_1: వర్ణనిర్ణయాన్ని గూర్చి ప్రాచీనులు పేర్కోలేదు. ఆధునికులు అర్థభేదక సామర్థ్యం గల ధ్వనిని వర్ణమని నిర్ణయించారు.

'a minimum unit of distinctive sound feature-a phoneme (Bloomfield—p-79)

ఉదా! కాలం_గాలం ।క। ।గ।

18_2,3 కారం_ఖారం; కద్దరు_ఖద్దరు ఇత్యాదుల్లో అర్థ భేదకత లేదు. ఇట్టివి Free Variation

మామ_మావ : Complementary distribution

19-1 : minimal pairs.

19-2 : Phonemic Script

23-2 : Phonetic Script___భాషా శాస్త్రజ్ఞు డీలిపిలో భాషను లిఖించుకొని, minimal pairs నేర్పరచుకొని వర్ణాల

నిర్ణయించి, ఆ భాషకు వర్ణాత్మక లేఖనాన్ని చేకూరుస్తాడు. అముఖ్యమైన ధ్వనులకు లిపులనవసరం_వర్ణాలకే లిపి. అప్పుడే పొదుపు.

19_3: వీటినే Supra — Segmental Phonemes అంటారు ఇవే భాషా సజీవ లక్షణాల్ని కల్గివుండేవి.

వ్యాకర్తలు వీటిని పేర్కొనరు.

19_4: ఏనుంగని కరమరయక

ఏనుంగపికరిమరయక ఇత్యాది రాఘవ పాండవీయ ప్రయోగాలు చూచేది

20-2 : Endo—Centric constructions
Exo –centric ,,
చూ. వాక్య విజ్ఞానం భా. ప. పుటలు 137–147
కర్మధారయ, తత్పురుష ద్వంద్వాలు : Endocentric phrases

బహుబ్రీహి : Exo-centric phrases

21-2 : చిత్రం వటుతరోర్మూలం
వృద్ధా శ్శిష్యాః, గురు ర్యువా
గురోఽస్తు మౌన వ్యాఖ్యానం
శిష్యాస్తు ఛిన్న సంశయః॥

21-3 : Deep grammar—Surface grammar
హృద్గతం, అలిఖితం —విరచితం
ఈ రెండు సమానంగా ఉంటే సంపూర్ణ వ్యాకరణం

21_4 : Concept Expression 1 కత్తితో కొట్టాడు

22_1 : Ex, కరణార్థం Expression 2 కత్తిచేత కొట్టాడు




రామేణ గచ్ఛతి—సహార్థం ($C_1$)
ఖడ్గేన ఛేదతి—కరణార్థం ($C_2$)

22_3 : ప్రవాహినీ దేశ్యా. (ఆంధ్ర శబ్ద చింతామణి)

23_1 : యతి మైత్రికి కావలసిన సజాతీయ వర్ణనిర్ణయం ధ్వని పరిజ్ఞానం వల్లనే కలుగుతుంది. చూడండి:

"శబ్ద సూత్రములను జగతి నేకస్థాన
సంభవంబు లగుచు సంధి వేళ
గల సవర్ణ సంజ్ఞదలపోసి యతులకు
గూర్పవచ్చు మరియు గొన్ని కృతుల॥
అప్పకవీయం III-48

23-3 : స్థానాన్ని పట్టి మాత్రమే పేర్లు పెట్టబడ్డాయి. ఆధునికులు స్థానకరణ ప్రయత్నాదులన్నీ పరిగణించి ధ్వనిని వర్ణిస్తారు:
ఉదా :

క : జిహ్వామూల హనుమూలీయ స్పర్శం. dorso_velar unaspirated unvoiced stop (చూ. భా. వ. పుటలు 184_92)

23_4 : సిద్ధే శబ్దార్థ సంబంధే—శబ్దార్థములకు గల సంబంధం ఈనాడెవరి చేతనో కల్పితం కాదు. అనాదిగా వస్తున్నది కాబట్టి నిత్యం సిద్ధం=నిత్యం.
(పాతంజలి మహాభాష్యం_పస్పశాహ్నికం)

24-4 : ప్రతి పదోక్తావ్యయాలు, లాక్షణికావ్యయాలు అనే విభజనాన్ని పురస్కరించుకోని భాషాధ్యయన పద్ధతు లీవిధంగా నిరూపించటం అపూర్వం. ప్రతి పదోక్త పాఠాలు సంస్కృతంలో ప్రచురం.

25_1 : ఇంద్రుడొకప్పుడు బృహస్పతి వద్ద ప్రతి పదోక్త పద్ధతిని సంస్కృతం వేయి సంవత్సరా లభ్యసించి కృతకృత్యుడు కాలేక పోయినాడన్న భాష్య పంక్తు లిట సంస్మరణీయం:

"బృహస్పతి రింద్రాయ దివ్యవర్ష సహస్రం
ప్రతిపదోక్తానాం శబ్దానాం శబ్ద పారాయణం
ప్రోవాచ, నాంతం జగామ. బృహస్పతిశ్చ
ప్రవక్తా. ఇంద్ర శ్చాధ్యేతా. దివ్యవర్ష సహస్ర
మధ్యయన కాలః. న చాంతం జగామ...."

భాషా శాస్త్రం భాషల్ని కుటుంబాలుగా విభజించి, కుటుంబా ధ్యయనాన్ని చేపూరుస్తుంది.

25_3 : ఆకృతి గణాలు, నియత గణాలని ఇవి రెండు రకాలు, చారిత్రకాధ్యయనానికివి తోడ్పడవు.

Every word has its own history—Bloomfield.

26_3 : దీనినే జాతి విభజనం (genetic classification) అంటారు.

26_2 : ద్రావిడ భాషలు సంస్కృత ప్రాకృత జన్యాలనే

27_1 : సిద్ధాంతంతో అన్వేషణ ప్రారంభం చేసి విఫలుడైనారు డాక్టర్ చిలుకూరి నారాయణరావుగారు

27_4 : ద్రావిడ భాషల్లో తత్సమ, తద్భవ, దేశ్య

28-1 : పద విభజనం ప్రాకృత భాషా వ్యాకరణానుసారంగా సాగింది. సంస్కృత జన్యమైన ప్రాకృత భాషల్లో దేశ్యా లుండగా, అటువంటి దేశ్యాల్ని పురస్కరించుకోవి తెలుగు మొదలైన ద్రావిడ భాషలు సంస్కృత జన్యం కాదంటం ఏమి సముచితమనే ప్రశ్న. పైకిది వాదంగా కనిపించినా పరిశీలిస్తే ఇందులో పస లేదు. ఎందు కంటే 'దేశ్యాలు' అనే విభాగాన్ని బట్టి ఇది ఈ ప్రశ్నమైంది. నామ సాదృశ్య మున్నా స్వభావ సాదృశ్య ముండాలి కదా! ప్రాకృతంలో దేశ్యాలు వ్యుత్పత్తి తెలియ ని. కావ్య ప్రయోగం లేనివి. అవి లేకపోయినా భాషా వ్యవహారం సాగుతుంది. కాని మన దేశ్యాలు అటువంటివి కావు. అవి లేకపోతే భాషలే లేవు. వీటికి వ్యుత్పత్తులు కూడ పరిశోధించి విఘంటువులు కూరు స్తున్నారు Telugu Etymological Dictionary Scheme లో కృతికర్త Telugu Research Assis-tant గా 31 సంవత్సరాలు పని చేపారు. కొన్ని పదాల వ్యుత్పత్తులు అన్వేషించారు. ఒక ఉదాహరణం: ఒడలు < ఉద్దె = to put on; that which puts on flesh and bone. ఇటు వంటివి చెప్తుంటారు.

28_2 : ద్రావిడ భాషలు సంస్కృత జన్యం అనేవాళ్లు, ఆ భాషల్లో 'దే- శ్యల'నేవి లేనేలేవని, అవన్నీ అతి పరోక్ష వృత్తి చేత

30_1 : Folk_etymology (భా.వ. పుట) 'నార్త'నే పదం లోకుల కపరిచితం. దానికి శాబ్దికంగా సన్నిహితమై, సంప్రదాయం ప్రకారం పాద చారియై నరసింహస్వామి దర్శనార్థం నారదుడు బయలుదేరిన చోటుకు 'నారదసింహాచలం' అనే కల్పనం 'లోకనిరుక్తి'.

భా. వ. పుట 164

30_2 : 'పరిక్లప్త నవప్రవర్తనాలు'—Shared innovations వల్ల ఉపకుటుంబాలేర్పడుతాయి. చూ. పుట 191

30-3 : Family, Sub-Family; branch; sub – branch; group, sub-group; Language-dialects

చూ. భా వ. పుట 39

30 4 : "ఘటేన కార్యం కరిష్యన్ కుంభకారకులం గత్వాహ. కురు ఘటం కార్య మనేన కరిష్యామీతిన తద్వచ్ఛ బ్దాన్ప్రయు యుక్షమాణో వైయాకరణకులం ప్రయోక్ష్య ఇతి!" (కుండతోపని చేయదలచినవాడు కుమ్మరి యింటికిపోయి 'నాకు పని యున్నది. కుండను చేసి యిమ్మ' అని యడిగినటు శబ్దములను ప్రయోగింప దలచినవాడు వైయాకరణుని ఇంటికి పోయి 'నేను శబ్దములను ప్రయో

గింపవలెను. తయారు చేసి యిమ్ము' అని యడగడు. ఆయా యర్థములను గ్రహించి, తమంతతామే శబ్దములను ప్రయోగించుచున్నారు.)

కిం శాస్త్రేణ క్రియతే? (ఈ వ్యాకరణశాస్త్ర మెందుకు?)— శాస్త్రేణ ధర్మ నియమః క్రియతే!

(శబ్దములను ప్రకృతి ప్రత్యయ విభాగము చేసి సుశబ్దములుగ విరూపించి వానిని ప్రయోగించుటయే ధర్మమని వియమించును —పస్పశాహ్నికము) శ్రీభాష్యం అప్పలాచార్యానువాదము.

31-1 : "ఏకః శబ్దః సమ్యక్ జ్ఞాతః శాస్త్రాన్వితః
సుప్రయుక్తః స్వర్గేలోకే కామధుగ్భవతి"

అని మహాభాష్యం.

శబ్దమును గూర్చి బాగా తెలిస్తే చాలదు. దాన్ని ప్రయోగించే దక్షత కావాలి. అంటే కావ్యోపయుక్తం కావాలి. అది పరమ లక్ష్యం. అప్పుడాశబ్దమే కామధేనువు లాగా కామితాన్ని చేకూరుస్తుంది. దీని కీక్రింది శ్లోకం ప్రమాణం:

"గౌర్గౌః కామదుఘా సమ్యక్ప్రయుక్తా స్మర్యతే బుధైః
దుష్ప్రయుక్తా పునర్గోత్వం ప్రయోక్తుస్సైవ శంసతి"
(కావ్య ప్రకాశికా_6)

గోశబ్దానికి వాక్కని, ధేనువని అర్థాలు. వాక్కు సుప్రయుక్తమైతే బాగా లాలింపబడ్డ గోవులాగా కోర్కెల్ని పిదుకుతుంది. దుష్ప్రయుక్తమైతే ఆ శబ్దమే ప్రయోక్తకు గోత్వాన్ని (పశుత్వాన్ని) చేకూరుస్తుంది.

31_2 : "ప్రకృతే స్సంస్కృతా త్సాధ్యమానం సిద్ధంచ తద్భవమ్
దేశ్య మప్యత్ర త్రిమత్వాత్ ప్రాకృతత్వేన కథ్యతే॥"
—అహోబలపండితీయము నుండి (సంజ్ఞా 4_11)
పూ=వికసించు అని ద్రావిడధాతువు. 'పూ' 'పూవు' (తె)

31-4 : తెన్=దక్షిణము అనే అర్థంగల ద్రావిడ
శబ్దం తెలుగులో పై దొలగింది, 'తెంగాయ'
'తెన్నేఱు' అనే సమస్త పదాల్లోనే గోచరిస్తుంది.

వడై=ఉత్తరం. తెనుఁగులో వడగాలి అంటే ఉత్తరపు గాలి అని సమస్తంగా ఉంది. కాని నిఘంటువుల్లో పడమటి దిక్కని

పేరొ్కటం పొరపాటేమో! బ్రౌన్ నిఘంటువు 'వడకు' అంటే ఉత్తరపు దిక్కు అన్నది. వడకు గుబ్బలి=హిమవత్పర్వతం. వడకు త్రోవ=ఉత్తరాయణం. 'వడకుంగుబ్బలి కుమారి వడవడవడకెం' (హర. vii_73) అని శ్రీనాథుడు. ఇక్కడ 'వడకు' అంటే వణికించు, మందుకొండ అనటం లోక నిరుక్తి.

(Folk Etymology)

32_2 : జంతు, వృక్ష శాస్త్రాలు లాగా భాషా శాస్త్రం కూడ వర్ణనాత్మక శాస్త్రం (descriptive science) ఈ అన్నింటికి 'నిర్మితి' (Structure) ప్రధానం. పాణిన్యాదులు గ్రీకు, లాటిన్ వ్యాకర్తలలాగా కాక పరిశీలన ప్రధానంగా వర్ణనాత్మక వ్యాకరణాలు రచించారని పాశ్చాత్యుల ప్రశంస.

32_3 : దీన్నే ఆధునికులు 'Taxonomy అంటారు. "The science dealing with the identification, naming and classification of organisms" (Webster)

32_4 : The first Taxonomist: వేదాలు తొలుత మూడుగానే విభక్త మంటారు. "తేవేదత్రయ మూర్త్రయస్త్రిపురుషాః" అని నన్నపార్యుని మంగళ శ్లోకం. కాని భాగవతం.

"ఋగ్యజుస్సామాథర్వాఖ్యా వేదాశ్చత్వార ఉద్ధృతాః
ఇతిహాస పురాణం చ పంచమో వేదఉచ్యతే॥
(I—iv—20)

"తత్రర్గ్వేదధరః పైలః సామగో జైమినిః కవిః
వైశంపాయన ఏవోకో నిష్ణాతో యజుషాం మునిః"

"అథర్వాంగిర సామాసీత్ సుమన్తుర్దారుణో మునిః
ఇతిహాసపురాణానాం పితామే రోమహర్షణః"
(I—iv—21, 22)

33-1 : 'There is no rule without exception'
—Old grammarians

'There is no exception without rule'
—New grammarians

నియమాన్ని విస్తృతంగా అపవాదాన్ని కలుపుకొని వర్ణిస్తే అపవాదముండదు. ఉదా : తాలవ్యాచ్చుల తోగూడిన కకారం చకారంగా మారుతుంది. దీనికి అపవాదం కన్నడం; తమిళంలో మూర్ధన్యపరక కకారం. ఈ అపవాదాన్ని సూత్రంలోనే చేరిస్తే సరిపోతుందిగదా!

33_2 : ప్రవాహినీ దేశ్యా।     (చింతామణి)

33_4 : "అల్పాక్షర మసందిగ్ధం, సారవత్ విశ్వతోముఖం
అస్తోక మనవద్యంచ। సూత్రం సూత్ర విదోవిదుః"

"అర్ధ మాత్రాలాఘవేన పుత్రోత్సవం మన్యన్తే
వైయాకరణాః" (132 వ పరిభాష, పరిభాషేందు శేఖరం
నాగోజిభట్టు)

సంజ్ఞా చ పరిభాషా చ విధిర్నియమ ఏవ చ
ప్రతిషేధోధికారశ్చ షడ్విధం సూత్ర లక్షణమ్॥
(కాతంత్ర వ్యాఖ్యా I_1_2)

34_1 ; పెద్ద వ్యాకరణాలు కావాలనే ఆరాటం ఎక్కువగా ప్రకటి స్తారు. తరగతికో ఉదాహృతి చాలుగదా. ప్రకృతి ప్రత్యయ విభాగం చేయగల సామర్థ్యం కలిగితే చాలు. శర్వవర్మ కుమార వ్యాకరణం అధ్యయనం చేసి హాలుడు పండితుడు కాలేదా! ఆఱుమాసాలలో

కేతన : "కంచి నెల్లూరు మఱియోరుగల్లయోధ్య 'యనుపురంబుల పై
గంగ కరుగు మనిన పగిది, నొకత్రోవఁ జూపెద బహూ
పథంబు లాంధ్రభాషకుఁ గలవని యరసికొనుడు." (13)

చిన్నయసూరి : శాసనమిదం దిక్ప్రదర్శనమ్—అజ్ఞాత దిశం దేశం జిగమిషోః పాన్థస్య మార్గం పృచ్ఛతః పురుషేణ కేనచి దేవం యాహీతి హస్త నిర్దేశేన దిశో దర్శనవ దిదం శాసన మధిజిగమి షూణాం ప్రథమ ప్రవృత్తా వుపకారకం భవతీత్యర్థః—సంస్కృత సూత్రాంధ్ర వ్యాకరణమ్। శాసనం బీయది దిక్ప్ర దర్శనంబు — ఆంధ్ర శబ్దానుశాసనము.

34—2 : Possibility మాత్రమే కాక Probability ని కూడా Transformational grammar సూచిస్తుంది.

34-3 : Language makes an infinite use of the finite means. భా. ప. పుట 3

34—4 : ఏవ్యక్తి భాషనంతా మాట్లాడడు. తన మాండలికం మాత్రమే వ్యవహరించగలడు. 'భాష' అనే వ్యవహారం స్థూలం మాత్రమే.

35—2 : వీటినే 'dialectmaps' అంటారు. ఇటువంటి మాపుల సంపుటినే 'dialect atlas' అంటారు. ఇటువంటివి కొన్ని

మాపుడు ఆచార్య భద్రిరాజువారు వ్యవసాయ వృత్తి పద కోశంలో ప్రచురించారు. సాహిత్య అకాడమీ ప్రచురించింది.

'Things seen are mightier than things heard' అనే ఉద్ఘాటన.

35_3 : వ్యవహార భేదక రేఖలు=Isoglosses: వీటిని బట్టి వ్యవహార మండలాల్ని (dialect regions) నిర్ణయించవచ్చు.

36-1 : London, Paris మొదలైన రాజధాని నగరాల్ని Supreme Speech centres అంటారు. ఇందుండి భాష వికేంద్రీకరణమైతే అట్టిదాన్ని Centrifugal force (moving or directed outward away from a centre or axis)

36_2 : పైదానికి వ్యతిరేకం=Centripetal force

37_1 : వంగదేశంలో ఈ విధంగా ఉన్నదంటారు.

37_2 : Every word has its own history అనే వినాదం. ప్రతి పదానికి చరిత్రేకాక ప్రాక్ చరిత్ర కూడా ఉంటుంది. When there is history, there must be pre-history. అనే హెచ్చరిక గమనార్హం.

37–3 : దేశాన్నైనా చూడాలి—కోశాన్నైనా చూడాలంటారు. కోశాని కెక్కని పదాలెన్నో దేశంలో వాడుకలో ఉన్నాయి.

37–4 : "రూఢిర్యోగాత్ బలీయసీ" అని వ్యాకరణోక్తి.

i) యోగము—అవయవార్థమును మాత్రం బోధించునవి. పాచకుడు—వంటను జేయువాడు.

ii) రూఢము—అవయవార్థంతో పనిలేక, సముదాయార్థన్నే బోధించు పదములు—ఆకాశం, బల్ల, పుస్తకము మొదలైనవి.

iii) యోగరూఢము—అవయవార్థమును బోధిస్తున్నా విశేషించి సముదాయార్థమునే బోధించేవి: పంకజము= పంకం నుండి పుట్టింది అనే అవయవార్థం బోధిస్తున్నా 'పద్మం' అనే అర్థంలోనే రూఢం. నత్తిగుల్ల మొదలైన అర్థాల్ని బోధించదు.

iv) యౌగిక రూఢం అనేది ఒకటున్నది. ఉద్భిదము: ఉద్భేదించునది—అవయవార్థమును బట్టి తరుగుల్మాదులు. 'ఉద్భిదాయజేత పశుకామః' అన్నప్పుడు.

ఉద్భిత్-యాగవిశేషం, రూఢ్యం, ఇదంత ప్రచురం కాదు కాబట్టి చెప్పలేదు.

కావ్యాలంకార సంగ్రహం, సన్నిధానం వారివ్యాఖ్య
పుటలు 137_8

మహాకవులు యోగికార్థాన్ని కూడా పరిగణిస్తారనటానికి కాళిదాసుని రఘువంశ ప్రయోగం 'జాయా ప్రతి గ్రాహిత గన్ధ మాల్యాం' అనేది శిరోధార్యం 'జాయా పదసామర్థ్యాత్ సుదక్షిణాయాః పుత్త్రజనన యోగ్యత్వ మస్తీతి సూచితమ్; తథా చ శ్రుతిః_

పతి ర్జాయాం ప్రవిశతి గర్భో భూత్వా స మాతరం
తస్యాం పునర్నవో భూత్వా దశమే మాసి జాయతే
తజ్జాయా జాయా భవతి య దస్యాం జాయతే పునః ఇతి
'యశోధన' ఇత్యనేన పుత్త్రపత్త్రా కీర్తి
లోభాద్రాజానర్హేఽపి గోరక్షణే ప్రవృత్త
ఇతి గమ్యతే' —మల్లినాథసూరి

39_3 : కిమోగ్రాఫ్ అనే యంత్రం ద్వారా శ్వాసనాదాది శబ్దధర్మాలు ఆధునికులు గ్రహిస్తున్నారు. కాని పూర్వులు ఇట్టివి

లేకుండానే ఘోషము, అఘోషము; వివృతము, సంవృతము మొదలైన శబ్ద ధర్మాలు పేర్కొన్నారు. వానికి సరిగా అర్థ వివరణం చేయలేకపోతున్నారు, ఇప్పటివారు.

40_2 : వృత్తి పదాలు క్రమంగా నశించి పోతున్నాయనే భీతితో వివిధ వృత్తి పదకోశ సంకలనానికి ఆంధ్ర ప్రదేశ్ సాహిత్య అకాడమీ కృషి చేస్తునే ఉంది. కొన్ని తయారై నాయి. కొన్ని అవుతున్నారు.

40-3 . Break the word and free the the thought
Break the thought and free the idea
Break the idea and free the image
Break the image and free the concept
Break the concept and free the experince

అనే ఆంగ్లోక్తి లీవద్యాని కాధారం

41_1 : తమిళులు అనువాదపు ఎరవు పదాల్ని (tanslated loans) వాడుక చేస్తారు. సంధి=పుణర్చి. సమాసం=తొక్తై మొదలైనవి. తెనుగువారు యథా తథంగానే స్వీకరించటానికి సంకోచించరు.

41-2 : dialect borrowing;' grammatical borrowing మొదలైన వాటిని Bloomfield వివరించాడు.

42_1 : విపరిణామం




42_2 : ఆకాంక్షా యోగ్యతాఽసత్తి తాత్పర్య

జ్ఞానాని సహకారిణి ఫలం శాబ్ద బోధః –

తత్తదర్థ ప్రతీతచ్ఛయోచ్చరి తత్వం తాత్పర్యమ్।

తేన భోజన ప్రకరణా 'సైంధవ మానయ'

ఇత్యుక్తే అశ్వాన్వయ బోధో నభవతి।

—తర్కామృతమ్ < తె. వ్యా. వి పుట 1043, FN—1

6)

42_3 : 'సంధి మాత్రం నజానాసి, మాశబ్దోదక శబ్దయోః
న చ ప్రకరణం వేత్సి, మూర్ఖస్త్వం కద మీ దృశః'

< తె. వా. ఏ. పుట 1053. F.N.—1

మూలంలోని 'మూఢ!'ను 'మూర్ఖ' అని దిద్దుకోవచ్చు.

42-4 : Specialisation, Expansion, Euphony—మొదలైనవి.

45_2 : 'Art lies in concealing art' అనే సూక్తికి సదృశంగా రచింపబడింది.

45_3 : Means and ends రెండు భాషా శాస్త్రంలో భాషే కావటంలో క్లిష్టత గోచరిస్తుంది.

45-4 : కాళిదాసుని కావ్యభాష రంగు, రుచి, వాసనలు కలదిగా శ్రీ అరవిందుల యభివర్ణనం: దీన్ని రచయిత కాళిదాస కవిత (ద్వి ము.) అనే పుస్తకం ద్వారా తెనుగువారి కందించారు.

46_1 : నాణానికి బొమ్మ, బొరుసు ఉన్నట్లుగా సాహిత్యానికి ఉంటుంది. అవే నాగరక సాహిత్యం, జానపద సాహిత్యం. ఈ రెండు తెమగువారి కుండటం ఆజాతి సుసంపన్నతకు నిదర్శనం.

"ఒకటి జానపదము నొకటి నాగరకమ్ము
ననగ నొప్పు వాఙ్మయమ్ము తెగలు;
బొమ్మ బొరుసుతోడ బొలుచు నాణెము రీతి
రెండు జాతి ఘనత కుండవలయు"

—సత్య. శివం, సుందరం పుట 70_3

జానపద భాషా ఛందస్సులపై ఇంతవరకు పరిశోధన జరిగి నట్లు కనిపించదు.

46_2 : కావ్య భాష కవియొక్క వైయక్తిక భాషణం (idiolect) నుండే రూపొందుతుంది. 'Style is the man' అనే సూక్తి అందు వల్లనే ఏర్పడింది. సమాసశైలి, కృదంతశైలి, తద్ధితాంతశైలి మొదలైన భేదాలు కవుల

కావ్యాలలో ప్రత్యేకంగా పరిశీలించవచ్చు. భారతం లక్ష్యంగా ఇటువంటి పరిశోధన ఈ రచయిత నేతృత్వంలో జరుగుతున్నది.

46_3-4 : ప్రియతద్ధితాః దాక్షిణాత్యాః_కృత్ప్రయోగ రుచయః ఉదీచ్యాః" అనే భాష్య పంక్తులు స్మరించవచ్చు. సామెతలు సారమతులైన ప్రజలు సృష్టించినవి. అందులో యతులు, ప్రాసలు కోకొల్లలు. చివరకు సామాన్య మానవుడు కూడా ప్రాసకోసం ఎలా ప్రాకులాడుతాడో సామెతే చెప్తున్నది: "ప్రాసకోసం పిడివానే కూసుముండ"

47_1 : సమాన వర్ణమైత్రి, సజాతీయ వర్ణావృత్తి మొదలైనవి జానపద వాఙ్మయంలోను, సామెతలలోను గోచరిస్తాయి. ఇట్టివాని ప్రపంచీకరణమే సాహిత్యంలో గోచరించే యతులు, ప్రాసలు. లక్షణ గ్రంథాల్లో అవి సువ్యవస్థితం. ఈ వివృతి రచయిత్రి ఈ అంశం మీదనే పిహెచ్.డి.కి కృషి చేస్తున్నది.

47_2 : "పాద బద్ధోఽక్షరసమ స్తంత్రీలయ సమన్వితః
శోకార్తస్య ప్రవృత్తోమే శ్లోకో భవతు నాన్యథా॥"

(బాల—ii—18)

47_3 : "మచ్ఛందా దేవ తే ప్రవృత్తేయం సరస్వతీ
రామస్య చరిత్రం సర్వం కురత్వ మృషిస త్తమా"
(బాల—ii-31)
"కురు రామకథాం పుణ్యాం శ్లోకబద్ధాం మనోరమామ్॥

47_4 : "ఛందో హీనో న శబ్దో౽స్తి, న చ్ఛంద శ్శబ్ద వర్జితమ్"–
నాట్యశాస్త్రము. (కావ్యాలోకం, పుట :9, తెలుగు అకాడమీ)

"... Each of these rhythmic systems proceeds from the unconscious dynamic habit of the language, falling from the lips of the folk. Study carefully the phonetic system of a language, above all, its dynamic features, and you can tell what kind of a verse it has developed--or, if history has played pranks with its psychology, what kind of verse it should have developed and some day will.' Language, by Edward Sapir, p. 230.

48_1 : "అపి మాషం మషం కుర్యాత్, ఛందో భంగం నకారయేత్
అనే హెచ్చరికను బట్టి ఛందస్సుకు ప్రాథమిక ప్రాముఖ్య ఉన్నట్లు విదితం (మాషం=దున్నపోతు; మషం=గారె: రెండు నల్లగానే ఉంటాయి)

48_2 : తెనుగు శిష్ట వ్యవహార భాషకే ఇంతవరకు వ్యాకరణం లేక పోవటం శోచనీయం. ఎరుకల యానాదివారి భాషలకు

వ్యాకరణాలు వ్రాయవచ్చు. అంటే ఆయాభాషా వ్యవస్థల్ని అభివర్ణించటమే.

48_3 : "సంస్కారో లోపాగమ వర్ణవికార ప్రకృతి భావ లక్షణాః"- వ్యాకరణ పదకోశం: తెలుగు అకాడమి.

"సంస్కారార్థోనియమః" ఆం. చిం.

"శాస్త్రీయ ప్రక్రియ కాల్పనికమే కాని, వాస్తవము కాదని చెప్పుచున్నాడు".

ఉపాయాః శిక్షమాణానామ్ బాలానా మపలాలనాః
అసత్యే వర్త్మని స్థిత్వా తతః సత్యం సమీహతే॥

శాస్త్రములు జిజ్ఞాసువులగు అపండితులను మోసగించునవేకాని, వాటి ప్రక్రియలో సత్యము లేదు. కాని జిజ్ఞాసువు కొంత కాలము అసత్య ప్రక్రియా మార్గమునందు నిలిచి, అటు పిమ్మట అవిద్యను వదలి సత్యమును బొందును".

——వాక్య పదీయము_II_240; పుట 268; తెలుగు అకాడమీ

8_4 : "వ్యాఖ్యానతో విశేష ప్రతిపత్తి ర్నహి సందేహా దలక్షణమ్"——సందేహం కలిగినంత మాత్రాన లక్షణం కాదని త్రోసి పుచ్చరాదు, పెద్దల వ్యవహారాన్ననుసరించి చేసిన వ్యాఖ్యానం వల్ల విశేషార్థాల్ని గ్రహించవచ్చు——పాతంజలిమహాభాష్యం——పస్పశాహ్నికం.

49_1 : ఏ భాషలోనైనా సంధి నాల్గు సన్నివేశాల్లో కల్గుతుందని ఇలా నిరూపిస్తారు. V+V; V+C; C+V; C+C'
తెనుగులో స్వరసంధి నిలా నిరూపించ వచ్చు:

$V_1+V_2 \rightarrow V_2; V_1+y \mid n \mid r \mid t \mid tt \mid V_2$

49-3 : తెనుగు ఇటువంటి భాషగా గణించవచ్చు.

49-4 ; అజంతతా పరిణామాన్ని బట్టి తెనుగు 'The Italian of the East' అనే ప్రఖ్యాతి గాంచింది.

నాదధర్మాలు : గ,జ,డ,ద,బ : నాదాలు
ఙ,ఞ,ణ,న,మ : నాదతరాలు
య,ర,ల,వ : నాదతమాలు అచ్చులు

50_1 : నాద తరమైన నకార ప్రభావంచేత శ్వాసములైన (Surds) క, చ, ట, త, ప లు నాదాలుగా మారుతాయి. దీన్నే పాక్షిక వర్ణ సమీకరణం (Partial assimilation) అనవచ్చు. కవి+లు → కవులు, హరి+ను—హరిని ఇత్యాదుల్లో స్వర సమీకరణం (Vowel assimmilation) గోచరిస్తుంది. ఇటువంటి నాద ధర్మాల్ని ఁ 'తెనుగు' మధురమైన భాషగా ఖ్యాతి గాంచింది. (చూ. బా వ్యా. ఏకాస వ్యాఖ్య పుటలు 63, 1?1, 135 మొ॥ ప్ర. ము.)

50_4 :
51_1 : } ప్రతిభాషలోని జాతీయాలు, సామెతలు నుడికారాల ఉంటాయి. పూర్వకవులు వీటిని ఎంతగా ఉపయోగి

అంత గొప్ప అనుకొనే వారు. అటువంటిది నిబద్ధం భాష. (bound language). ఇట్టిభాష నింకో భాష లోనికి పరివర్తింప జేయటం చాలాకష్టం. ఇవిఎక్కువగా లేనిది యనిబద్ధ భాష (Free language). ఇటువంటి పరివర్తనం తేలిక. సపీర్ పండితుడు భాషలో రెండు విభాగాలు గోచరిస్తా యంటాడు. (i) సాధారణీ కృత భాషాతీతకళ (Generalised non-linguistic art) ప్రత్యేక భాషా సంబంధికళ (Specifically lingnuistic art) తొలి భాగం అనువాద సౌలభ్యాన్ని కల్గి ఉంటుంది. చూ. భా. ప పుటలు 299-300, Sapir's Language pp. 222-23. మన పూర్వులు కథ చెప్పే కావ్యాల్ని 'నిబద్ధ కావ్యాల'ని ముక్తకాలను అనిబద్ధ కావ్యాలని వ్యవహరించటం ఇక్కడ స్మరణీయం.

51-2 : To unlearn is more difficnlt than to learn. స్వభావోదురతి క్రమః.

51-3 : చూ. భా. ప. పుటలు 301, 302

52-2 : ఉదాత్త భావాలు ఉదాత్త భాషలోనే వెలువడుతాయి.

53-1 : Proper words in proper order Swift, Definition of a Good style.

53-1 : వ్యస్త పద శైలి సమస్త పదశైలి : (absolute × relative styles) సమస్త పదశైలి కంటె వ్యస్తపదశైలి గొప్పదని కొందరంటారు. ఏ పదాని కాపదం భావ చిత్రాన్ని నిర్మిస్తుంది. "the more directly the word reaches and sinks deep into the soul, the

greater the poetry" (Sri Aurobindo, Future poetry, p. 13)

సమాసానికి విగ్రహవాక్యం ఊహించుకోవాలి.సామూహికంగా ఉంటుంది శబ్ద చిత్రం. గంభీరభావాలకు సమాసంపడితేనే బాగుంటుంది అంటారు కొందరు. అక్లిష్టమనోహర సమస్త పదశైలికి మార్గదర్శి తెలుగులో నన్నయ ఋషి.   సమస్త పదశైలి "నితాంత దంతపి.

దనరటదాస్య రంగవికట భ్రుకుటీచటుల ప్రవృత్తన
ర్తన ఘటనా ప్రకారభయదస్ఫురణా పరిణద్ధ మూర్తియై"
(విరాట—ii—133)

వ్యస్తం : నేలయు నింగియు దాళముల్గా జేసి
యేపునరేగి వాయించి యాడ (134) ఈ రెండు పద్యాల్లో ఏశైలి గొప్పో పాఠకులు నిర్ణయించ గలరు.

వామనుడు : రీతిరాత్మాకావ్యస్య, విశిష్టా పదరచనా రీతిః, విశేషో గుణాత్మా.

53-2 : ....The 'mantra' in poetry, that rhythmic speech which as the veda puts it, rises at once from the heart of the seer and from the distant home of the Truth Sri Aurobindo's Future Poetry, p. 11.

మీ మాటలు మంత్రమ్ములు (మను. 1-62) అన్నట్లుండాలి శైలి. 'మననాత్ త్రాయకుతే ఇతి మంత్రః — మనన చేయుట వలన రక్షించును. మనన యోగ్యమైన పదాళి, కూడిన కవితాశైలి మాంత్రికశైలి.

53-3 : Stylistics : branch of language study concerned with the free selection of forms. p. 213: Language in the Modern world by simeon potter.

54-1 : Perhaps, the major reason why the international language movement has, on the whole, been losing momentum is that more and more members of the general public are coming to realise that the ideal of 'one world, one language' is so unrealistic as to be quite unattainable and is in addition quite unnecessary-Introductory Linguistics by Hall (Jr.) p 458.

54–3 : స్వర్గ గోపురం (Bable Tower) బైబిల్‌లో ఈ కథ ఉంది. పూర్వం మానవు లందరు స్వర్గానికి పోవాలనే ఆరాటంతో ఒక గోపురాన్ని నిర్మిస్తుండగా భగవంతుడీ ప్రయత్నాన్ని విఫలం చేయాలని 'ఒకరి భాష ఒకరి కర్థం కారాద'ని శపించాడట సున్నం తెమ్మంటే నీళ్లు తెచ్చి, నీళ్లు తెమ్మంటే సున్నం తేవటంతో పనివాళ్లు ఒకరితో ఒకరు కలహించు కొన్నారు. నిర్మాణం ఆగిపోయింది. కథలోని నిజానిజా లట్లావుంచి, మానవులు ప్రాచీన కాలంలో ఒకే భాష మాట్లాడుకొనే వారేమో అనిపిస్తుంది.

55–1 : జాతులన్నీ ఏదోవిధంగా సాంకర్యం పొందే ఉంటాయి. జాతి స్వచ్ఛతా వాదం మిథ్య. "If ethnology demonstrates kinship of race, kinship of speech may be used to support the argument. But

we cannot reverse the process and urgue from language to race''

Introduction to the Science of Language by Prof. Syce part—II—365—368

మూ. భా. ప. పుటలు 285_291

55–2 : మాట్లాడేది తెలుగే అయినా, ఒకే జాతి అయినా ప్రత్యేక తెలంగాణోద్యమం, ఆంధ్రోద్యమం భావాలలో పొత్తు లేకనే చెలరేగాయి? ఇందులో రాజకీయ నాయకుల స్వప్రయోజనం ఉండనే ఉంటుంది.

56_1 : స్వామి వివేకానంద, గాంధీ మహాత్ముడు ఆంగ్ల భాష ద్వారానే తమ భావౌన్నత్యాన్ని చాటారు. 'మానవ నిర్మితంబైన ఆంగ్లేయమ్ము శ్రీ ఋషి ప్రోక్తమ్ము చేసినావు కేవలము ఋణపడ్డ దాంగ్లేయజాతి' అని శ్రీ విశ్వనాథ గాంధీని స్తుతించటం గొప్పగా ఉంది.

56_3 : "ఉదార చరితాం నాంతు వసుధైవ కుటుంబకమ్" వసుధైక ప్రభుత్వం ఇప్పుడు స్థాపింపబడాలి. అప్పుడే మానవ విజ్ఞత ప్రదర్శితం.

56-4 : ఏకలిపిని సాధించటం ఒక మెట్టు. దేవనాగరిలిపి అక్షరలిపి. (Syllabic Script) రోమన్ లిపి వర్ణలిపి. (phonemic script) ఆంగ్లలిపికి కొన్ని గుర్తులు చేరిస్తే ఇది ఏర్పడుతుంది. ప్రస్తుతమున్న టైపు మిషన్లను వాడుకోవచ్చు.

57_1 : విశ్వసమైక్యం అంటే రచయిత భావమిది. భాషావరోధముండ కూడదు. ఏ భాషలో ఏవ్యక్తి ఉపజ్ఞోపేతంగా ఏది

PUR



వ్రాసినా అది విశ్వానికంతటికి అందేటట్లుగా ఉండాలి. ఏకత్వాన్ని (uniformity) సాధించలేక పోవచ్చు కాని సమైక్యాన్ని (unity) ని సాధించటం అసాధ్యం కాదు. unity is not uniformity but harmony in diversity.

57-4 : తమాషాగా, అలవోకగా చెప్పిన పద్యాలివి. రచయిత జీర్ణించుకొన్న విజ్ఞానానికి నిదర్శనం.

58_1 : 'వాఙ్మయ తపస్వి' అంటే ఎవరో రచయిత సొంతంగా నిర్వచిస్తున్నారు. ప్రజా భాషను—కవుల భాషను రెంటిని ఉపాసించాలంటారు. భాషా శాస్త్రజ్ఞులు వాఙ్మయాన్ని నిరసించటం, వాఙ్మయ ధురంధరులు భాషా శాస్త్రజ్ఞుల్ని హేళన చేయటం వీరికి గిట్టదు. సామాన్య భాషా దృష్టి, విశేష భాషా దృష్టి ఏదీ కోల్పోరానిది. ఒకటి నిత్యజీవనానికి, ఇంకోటి సౌందర్య జీవనానికి ఉపయుక్తం.

58_2 : Empty morphemes అంటారు. ఈ ఆగమాలు అనిష్టమైన సంధిని నివారించటానికి వచ్చినవే. యడాగమం ఇట్టిదే, ధీరురాలు=ధీర (స్త్రీ) ధీరుని యొక్క భార్య—ధీరునాలు. (ఇక్కడ 'ఇచట అలు శబ్దము వృత్తిని స్త్రీమాత్ర పరము' అని సూరి (బా.వ్యా. సంధి 31) కర్మధారయ సమాసానికి పరిమితం చేయటం గమనార్హం తత్పురుషలో కాదని అర్థం.

58_3 : 'అష్టాధ్యాయీ జగన్మాతా అమర కోశో జగత్పితా' అనే ఆర్షోక్తి ఆధారం.

* * *